# చందమామ

ఈ సంచికలో కథలు
వింతలు - విశేషాలు

★



ఇవి గాక ఫోటో శీర్షికల పోటీ
మొదలైన మరి ఎన్నో
ఆకర్షణలు.



రోజూ తొడిగే దుస్తులు

# సన్‌లైట్ వల్ల

## ఎంత తెలుపో ఎంత కాంతియో




సొగసుగాను, శుభ్రంగాను, మరియు తెల్లగాను, కాంతిగాను, వుంటవి. మీ బట్టలను వుతికే సన్‌లైట్ గుణం అదే! మీ బట్టలన్నిటినీ ఇంట్లో సన్‌లైట్‌తో వుతుక్కోండి.

**సన్‌లైట్ ఉత్తమ నురగనిచ్చే శుద్ధమైన సబ్బు**

S. 32A-X29 TL

హిందుస్థాన్ లీవర్ ఉత్పత్తి

# ఫ్లూ నుంచి రక్షణ పొందండి

WCRY-4-TEL




## సేవించండి
## వాటర్‌బరీస్ కాంపౌండు

**ఎఱ్ఱ లేబిలు**

### కేవలం నివారిణియే కాదు నమ్మకమైన టానిక్కు కూడా!

వాటర్ బరీస్ కాంపౌండు మీద, తరతరాలుగా, కుటుంబాలు నమ్మకముంచి ఆధారపడడానికిగల అనేక మంచి కారణాలలో నాలుగింటిని ఈ క్రింద ఉదహరిస్తున్నాము.

1. వాటర్ బరీస్ కాంపౌండు నివారిణియేగాక నమ్మకమైన టానిక్కు కూడా. శరీరప్రతిఘటన శక్తిని పెంపొందించడంలో సాయపడుతుంది.
2. వాటర్ బరీస్ కాంపౌండు దగ్గులను సత్వరం ఫలప్రదంగా నిర్మూలిస్తుంది.
3. వాటర్ బరీస్ కాంపౌండులో క్రియోజోట్ మరియు గయాకోల్ గలవు. అవి వాయు తిత్తులను శుభ్రపరుస్తాయి.
4. వాటర్ బరీస్ కాంపౌండు ఆకలిపుట్టిస్తుంది. జీర్ణమగుటలో సాయపడుతుంది. రక్తమును శుభ్రపరుస్తుంది. మరియు ఖనిజ లవణముల నష్టమును భర్తీ చేస్తుంది.

## వాటర్‌బరీస్ కాంపౌండు | ఎఱ్ఱ లేబిలు



వార్నర్-లేంబర్ట్ ఫార్మసూటికల్ కంపెనీ (పరిమితమైన బాధ్యతలలో యు. ఎస్. ఏ. లో స్థాపితము)

# పాఠకుల లేఖలు

## జూన్ 1963

ఉత్పలవారి "దాస్య విముక్తి" వడ్డాది వారి చిత్రములతో బాల ప్రపంచమునకు చాల ఆనందము చేకూర్చుచున్నది. తాతయ్య చెప్పిన "బుద్ధి తక్కువ గణితం" దేశమున కెంతో ఉపయోగము. "కిష్కింధాకాండ" శంకర్ చిత్రములతో చాల ఆకర్షణీయంగా ఉన్నది. "రాకాసిలోయ" చాల బాగున్నది. "గంధర్వ చక్రవర్తి కూతురు" "చందమామ" కు వన్నె తెచ్చినది.

—నోరి శ్రీకృష్ణమూర్తి, వారాసిగూడ

"ఈ నెల 'చందమామ' పరమ ఛండాలంగా తయారైంది. కథలు, చిత్రాలు చెత్తగా వున్నాయి"—అని యెలా రాయమంటారు? కథలు అద్భుతంగా వున్నాయి. యింతవరకు నేను దయ్యాలను గురించి పిరికి తనంగా చెప్పే కథలే విన్నాను. ఈ సంచికలోని దయ్యాల కథలు రాసిన ఆర్. నారాయణరావుకు అభినందనలు. "రాకాసిలోయ" బ్రహ్మాండముగా నున్నది. విజ్ఞాన విషయాలు! "మీకు తెలుసా?" చక్కటి శీర్షిక. మాట మాత్రమైనా ముందు తెలుప లేదేమండి ?

పెండ్యాల కృష్ణమూర్తి, నాగన్నపల్లి (కాంప్)

ముఖ చిత్రం ఎంతో బాగుంది. "మీకు తెలుసా?" "భారత చరిత్ర", "ప్రపంచ వింతలు" ఎంతో విజ్ఞానాన్ని చేకూరుస్తున్నాయి. "రాకాసిలోయ" చదవటానికి ఎంతో ఆసక్తిగా ఉంది. "చెవిటి మాలోకం", "అదృష్టదేవత" చాలా బాగున్నాయి.

—చామర్తి వెంకటచలపతిరావు, తిరుపతి

మామా! ఉగాదికి నువ్వు మాకు ప్రెజెంట్ చేసిన అంజనేయులవారి ఫొటో ఈ పాటి కప్పుడే ప్రేమ్‌లో బిగించేశా! వడ్డాదిగారినీ, శ్రీ ఉత్పలగారినీ అడిగానని చెప్పు. ఉంటాను.

—అడపా చిదానందమూర్తి, విశాఖపట్నం

ఈ నెల "గంధర్వ చక్రవర్తి కూతురు", "కృతజ్ఞతా రహితులు" [బేతాళ కథ], "రాకాసిలోయ" చాలా బాగున్నాయి.

—ఎం. రమేష్, కాకినాడ

కొత్తగా "మీకు తెలుసా?" శీర్షిక ప్రవేశపెట్టినందుకు మీకు నా అభివందనలు తెలుపుచున్నాను.

—కలిసిపూడి సరస్వతి, విజయనగరం

"భారత చరిత్ర" శీర్షిక క్రింద విద్యార్థుల కుపయుక్తమగు రాజుల చరిత్రలు ప్రచురించుచున్నందులకు ధన్యవాదములు. "దాస్య విముక్తి", "గంధర్వ చక్రవర్తి కూతురు", "అష్టావక్రుడు", "వెంకటప్ప సంకటం" కథలు చదువరులకు ఉత్సాహంగా యున్నాయి.

—టి. యస్. వాట్స్, ఎస్. అబ్దుల్ హక్,
ఆంధ్రరాష్ట్ర ప్రాథమికోపాధ్యాయ పరిషత్తు,
జోనల్ సెక్రటరీలు, హస్తగేరి (కాంప్)

"గంధర్వ చక్రవర్తి కూతురు" కథ పొడిగించమని మా ప్రార్థన.

—వి. నిర్మలమేరీ, కడప

"చెవిటి మాలోకం" అనే కథ నన్ను ఆనంద సముద్రంలో ముంచింది. ఇంత ఆకర్షించేలాగ బొమ్మలు వేసేవారికి, కథలు వేసేవారికి నా వందనాలు.

—శ్రీనివాసమణి, రాజమండ్రి

## రక్షణ కృషికి సంబంధించిన విషయాలకై చదవండి...




# ఆంధ్రప్రదేశ్

ఇటీవల ప్రవేశ పెట్టిన అనేక నూతన శీర్షికలకు తోడు రాష్ట్రంలోని ఉన్నతాధికార వర్గంయొక్క యదార్థాభిప్రాయాలను, ఇంగ్లీషు, తెలుగు, ఉర్దు, హిందీ భాషలలో వెలువడే ఆంధ్రప్రదేశ్ మాస పత్రికలో ప్రచురించడం జరుగుతున్నది.

దేశరక్షణ సన్నాహం కృషికి, వివిధ రంగాలలో ప్రజలు జరుపుతున్న కృషికి సంబంధించిన అనేక వ్యాసాలు కూడా ఇందులో ఉంటాయి.

వీటికి తోడు ఉత్తేజాన్నీ, ఆనందాన్ని కలిగించే కథలు, గేయాలు మొదలైన అనేక అంశాలుకూడా ఉంటాయి.

దాదాపు వందమంది ఏజంట్లతో రాష్ట్రంలోని అన్ని జిల్లాలలోనూ, మారుమూల గ్రామీణ ప్రాంతాలలో కూడా 'ఆంధ్రప్రదేశ్' పత్రిక అధికంగా సర్క్యులేటు అవుతున్నది. అంతేకాక దేశంలోని ఇతర రాష్ట్రాలకూ, విదేశాలకూ ఎక్కువ సంఖ్యతో ప్రతులు వెళ్తున్నాయి. అందువల్ల అన్నిరకాల ఉత్పత్తులకు చెందిన ప్రకటనలకు ఇది లాభం చేకూర్చుతుంది.

వార్షిక చందా రు. 3-00 మాత్రమే. ఏజంట్లవద్ద గానీ, హైద్రాబాదు లోని సమాచార పౌర సంబంధాల శాఖనుంచి గానీ పత్రికను పొందవచ్చు. జిల్లాలలోని జిల్లా ప్రజా సంబంధాధికారులకు కూడా మీ చందా చెల్లించవచ్చు.

—స. పౌ. సం. శా. ఆం. ప్ర.



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

శ్రీ ఉత్పల సత్యనారాయణాచార్యగారి "దాస్య విముక్తి" ఈ సంచికతో పూర్తి అవుతున్నది. పై సంచిక నుంచి వారు రచించిన "శ్రీకృష్ణ లీలలు" ప్రారంభమవుతుంది.

"చందమామ" పాఠకుల అభిమాన కవి అయిన సత్యనారాయణాచార్యగారి గేయాల సంపుటి "ఉత్పల మాల"కు భారత ప్రభుత్వ బహుమతి లభించటం మనకు గర్వ కారణమని చెప్పాలి. ఈ సంపుటిలో గల "గంగావతరణము", "క్షీరసాగర మథనము", "శమంతకమణి", "చందమామ" పాఠకులకు సుపరిచితములై, వారి మెప్పు పొందినవే.

శ్రీ సత్యనారాయణాచార్యగారి గేయ కథలను ప్రకటించిన గౌరవము, "చందమామ"కు దక్కింది.

సంపుటి : 32 - జూన్ 1963 - సంచిక : 6





# భారత చరిత్ర




ఖల్జీ సుల్తాను జలాలుద్దీన్ ఫీరూజ్ ఢిల్లీ పెద్దలకు నచ్చలేదు. అతను గద్దె ఎక్కే నాటికి 70 ఏళ్ళ వృద్ధుడు. అతను తురుష్క జాతివాడు కాడని వారికి ఏవగింపు. అయితే అతను తన సౌజన్యంతోనూ, ఔదార్యం తోనూ, న్యాయబుద్ధితోనూ ఢిల్లీలోని అమీర్లను సుముఖులను చేసుకోగలిగాడు. అతని శాంతి ప్రియత్వమూ, ఔదార్యమూ తరుచు మితిమించి ఉండేవి. తిరుగుబాటు చేసిన వారిని క్షమించేసేవాడు.

అయినప్పటికీ 1292లో మంగోలు దండ్లు ఇండియా పైకి వచ్చినప్పుడు జలాలుద్దీన్ వారిని చిత్తుగా ఓడించాడు. ఓడిన సేనను తిరిగి తమ దేశానికి వెళ్ళిపోనిచ్చాడు. మంగోలులు కొందరు ఇస్లాము మతం పుచ్చుకుని ఢిల్లీ పరిసరాలలో స్థిరపడి పోతామంటే అందుకు సమ్మతించాడు. "కొత్త ముస్లిములు" అని పిలవబడిన ఈ మంగోలులు ఢిల్లీ చక్రవర్తులకు చాలా చిక్కులు తెచ్చిపెట్టారు.

జలాలుద్దీన్ సోదరుడి కొడుకు అలా ఉద్దీన్ ఖల్జీ. జలాలుద్దీన్ అతణ్ణి ఎంతో ఆపేక్షగా చేరదీసి, తండ్రి లేని బిడ్డ అని మాలిమి చేశాడు. తరవాత అతణ్ణి తన అల్లుణ్ణి చేసుకున్నాడు కూడా. కర (అలహాబాదు జిల్లా) అనే ఈనాము అతనికి కట్టబెట్టాడు. కర స్వాధీనమైన నాటి నుంచి అలా ఉద్దీన్‌లో ధనకాంక్ష, పదవీకాంక్ష తల ఎత్తాయి. ఇతను 1292లో మాల్వా పై దాడి చేసి భీల్సానగరం పట్టుకుని, ఇందుకుగాను అయోధ్య ఈనాముగా పొందాడు.

దక్షిణాన దేవగిరి అత్యంత సంపన్నమయినదని అలా ఉద్దీన్ భీల్సాలోనే చూచాయగా విన్నాడు. అప్పట్లో రామచంద్ర దేవుడనే యాదవరాజు (కాకతీయ రుద్రమదేవికి సమకాలికుడు) దేవగిరిని

**21.** అలా ఉద్దీన్ ఖల్జీ రాజ్యాకాంక్ష

పాలిస్తున్నాడు. దేవగిరిని కొల్లగొట్టాలని అలా ఉద్దీన్‌కు కాంక్ష కలిగింది: తన మామకు తెలియకుండా వెయ్యిమంది అశ్వికులతో వింధ్యను దాటి దేవగిరి చేరాడు.

రామచంద్రదేవుడు ఈ యుద్ధానికి సన్నద్ధుడుగా లేడు. పైగా దేవగిరి సేనలో హెచ్చు భాగాన్ని తీసుకుని అతని కొడుకు శంకరదేవుడు దక్షిణ ప్రాంతాలకు వెళ్ళి ఉన్నాడు. అయినప్పటికీ రామచంద్రదేవుడు శక్తికొద్దీ యుద్ధం చేసి ఓడిపోయి శత్రువుకు భారీగా పరిహారం ఇవ్వటానికి ఒప్పుకున్నాడు. అలా ఉద్దీన్ తిరిగి వెళ్ళి పోబోతుండగా శంకరదేవుడు ససైన్యంగా వచ్చి అతన్ని ఎదిరించాడు. తండ్రి చెప్పినా వినక అతను యుద్ధం చేసి చివరకు ఓడిపోయాడు. తనకు తోడు రమ్మని పరిసర దేశాలవారిని శంకరదేవుడు అడిగాడు కాని ఎవరూ రాలేదు. అందుచేత అతను శత్రువుకు మరింత హెచ్చు పరిహారం ఇచ్చి సంధి చేసుకున్నాడు.

అలా ఉద్దీన్ చేసిన ఈ సాహస కృత్యం ఫలితంగా దక్షిణ దేశాల (దక్కను) సంపద కొల్ల పోవటమేగాక ఢిల్లీ సుల్తానుల ఏలుబడి వింధ్యను దాటి దక్కనుకు వ్యాపించటానికి పునాదికూడా ఏర్పడింది. ఇలా కొల్లగొట్టిన ధనాన్ని అలా ఉద్దీన్ తన మామకు



అందనివ్వకపోగా, తన దృష్టిని ఏకంగా ఢిల్లీ సింహాసనం మీదనే లగ్నం చేశాడు. అతను తన మామను కరకు రమ్మని ఆహ్వానించాడు. జలాలుద్దీన్ సిబ్బందిలో ఉన్న రాజద్రోహి ఒకడు ప్రోత్సహించాడు. అసలే జలాలుద్దీనుకు అలా ఉద్దీ నంటే గుడ్డి ప్రేమ. అందుచేత, తన హితం కోరుతున్న వారు వద్దన్నా వినక, కనీసం తన అంగరక్షకులనైనా వెంట పెట్టుకోక, ఆయన పడవ ఎక్కి బయలుదేరి వెళ్ళి అలా ఉద్దీన్ రాజ్యకాంక్షకు బలి అయిపోయాడు. 1296 జులై 19న అలా ఉద్దీన్‌ను అతని అనుచరులు సుల్తానుగా ప్రకటించారు.

జలాలుద్దీన్ భార్య మలికా జహాఁ అసాధ్యురాలు. ఆమె చేసే పన్నాగాలు సహించలేక ఆమె పెద్ద కొడుకు అర్కలీ ఖాన్ ముల్తానులో దూరంగా ఉండి పోయాడు. తన భర్త చని పోయినట్టు తెలియగానే మలికా జహాఁ తన చిన్న కొడుకును రుక్నుద్దీన్ ఇబ్రాహీమ్‌ను ఢిల్లీలో సుల్తానును చేసింది. ఈ సంగతి తెలిసి అలా ఉద్దీన్, వర్షాలనుకూడా లెక్క చేయక, ఢిల్లీకి బయలుదేరివచ్చాడు.

అలా ఉద్దీన్‌ను ప్రతిఘటించటం ఇబ్రాహీమ్‌కు సాధ్యం కాలేదు. పైగా అతని అనుచరులు అతనికి అండగా నిలబడలేదు. అందుచేత ఇబ్రాహీమ్ తన తల్లితో సహ ముల్తానుకు పారిపోయాడు. అలా ఉద్దీన్ దక్కను నుంచి కొల్లగొట్టిన బంగారంతో ఢిల్లీ ప్రముఖులనూ, పౌరులనూ కూడా సుముఖులను చేసుకుని 1296 అక్టోబరు 3 న ఢిల్లీలో సింహాసనం ఎక్కాడు.

అయితే అలా ఉద్దీన్ సుఖంగా రాజ్యం చెయ్యలేదు. కొందరు తుర్కులు పెడ తిరిగారు. రాజపుత్ర స్థానం, మాల్వా, గుజరాతుల పాలకులు అతణ్ణి ధిక్కరించారు. మంగోలుల ప్రమాదం ఉండనే ఉన్నది. అయినా ఈ ప్రతి బంధకా లన్నిటినీ అతను సమర్థతతో ఎదుర్కొన్నాడు. అతను సింహాసనం ఎక్కగానే మంగోలులు దాడి చేసి ఓడిపోయారు. మరుసటి ఏడు మరొక దాడి చేసి, ఓడి, వేల సంఖ్యలో ఖైదీలుగా పట్టుబడ్డారు. 1299లో వారు తిరిగి దాడి చేశారు. ఈసారి వారి ఆశయం దోపిడీ కాదు, విజయం. వారు పల్లెలను కొల్లగొట్టక, కోటలను పట్టక, తిన్నగా ఢిల్లీ పైకి వచ్చారు. యుద్ధం జరిగింది. చివరకు వారు నిష్క్రమించారు. వారు మళ్ళీ 1304లోనూ, 1307లోనూ దాడులు చేసి ఓడిపోయి, విసుగెత్తి, అలా ఉద్దీన్ ఖల్జీ బతికి ఉండగా మరి రాలేదు.





# దాస్యవిముక్తి

షష్ఠాశ్వాసము :

హిమగిరిపై గజ కచ్ఛపముల తిని,
ఎగసెను గరుడుడు సురలోకమునకు ;
ఆకాశమ్మున నిప్పులు గ్రక్కెడు
తోకచుక్కవలె తోచెను గరుడుడు !

అతని ఱెక్కల వాతూలమునకు
ఆకాశమ్మున దూదిపింజలుగ
మబ్బులు చెల్లాచెదరై పోయెను,
మన్ను మిన్ను ఒకలాగై పోయెను !

వినతాసుతు పెనుఱెక్కల చప్పుడు
విని భీతిల్లిరి దేవత లెల్లరు ;
చప్పుడేమియని దేవేంద్రుడు తన
సౌధమెక్కి నలుదిక్కులు చూచెను.

భీకర పక్షాంచలముల నార్చుచు
పైకి వచ్చు పక్షీంద్రుని కనుగొని,
ఇంద్రుం డోర్వక కన్నులు వేయిని
ఎఱ్ఱచేసి తన సభ కరుదెంచెను.

వజ్రాయుధమును పూంచి పట్టుకొని,
వరుసగ ఇంద్రుడు దిక్పాలుర కని,
'సేనలు పంపుడు, శత్రుని చంపుడు :
వైనతేయు డదె మనపై వచ్చెను.'

అనినంతనె రణభేరులు మ్రోగెను,
అమరసైన్యములు బారులు సాగెను ;
అమరేంద్రుండును వేగిరపాటున
ఐరావతగజ మధిరోహించెను.

అమరులు తనపై దండెత్తుట కని,
అమితకోపమున గరుడుడు పైబడి,
ఱెక్కల నడచుచు, ముక్కున పొడుచుచు,
ఱివ్వున నెగురుచు, చివ్వున కవిసెను.

కొందఱు గరుడుని ఱెక్కల దెబ్బకు
క్రిందయి మీదయి అలజడి నొందిరి ;
కొందఱు కాళ్ళకు, వ్రేళ్ళ కిఱికికొని
కొఱప్రాణంబుల గిజగిజలాడిరి.

ఉత్పల సత్యనారాయణాచార్య



ఎత్తివచ్చు సురవీరులపై బడి,
నెత్తిమీద పెనుముక్కున మొత్తుచు,
నెత్తురు వఱ్ఱొసరించెను గరుడుడు
నిమిషంబున రణరంగము నంతట.

భీకరముగ పక్షీంద్రుడు క్రిందకు
దూకుచు, లేచుచు, పల్టీ వైచుచు,
ఎక్కడ చూచిన అక్కడ తానయి
ఎల్లర చిందఱ వందఱలాడెను.

దిక్పతు లెల్లరు కకవికలై నలు
దిక్కులకును పరుగెత్తి తొలంగిరి ;
సిద్ధులు సాధ్యులు దాసోహంబని
చేతులు మోడిచి చప్పున లొంగిరి.

అంతట గరుడుడు దేవలోకమున
అమృతం బుండిన చాయకు పోయెను ;
అచ్చట అమృతము చుట్టును పెల్లుగ
అగ్నిజ్వాలలు అడ్డం బాయెను.

గరుడుం డంతట వేగముగా చని,
గంగా జలముల నోటబట్టుకొని,
చక్కవచ్చి ఆ అగ్నిహోత్రమున
పుక్కిలించి చల్లాఱగ జేసెను.

అచ్చట రెం డిరుతలల శిఖండులు
అమృతభాండమును చుట్టి పరుండెను ;
గరుడుడు తెక్కల దుమ్మెగజిమ్ముచు,
కండ్లు గప్పి ఆ పాముల చెండెను.

అమృతపాత్రమును గైకొని గరుడుడు
ఆకసమున కువ్వెత్తుగ లేచెను ;
తెక్కలు గట్టుక స్వర్గ సంపదలు
లేచిపోవుచున్నట్లుగ తోచెను !

అతని శక్తికి, మాతృ భక్తికిని,
అమృతపానమున అనాసక్తికిని,
మెచ్చి రమాపతి విష్ణువు దర్శన
మిచ్చి, ఒకానొక వరము వేడుమనె.

గరుడుడు శ్రీమన్నారాయణునకు
పరమ భక్తితో ప్రణతు లొనర్చెను ;
దివ్యమూర్తి నటులెంత చూచినను
తృప్తితీఱ కత డిట్టులు వేడెను :

"దేవా! నీ పదపద్మము లెప్పుడు
సేవించుచు చరితార్థుడ నయ్యెద,
మీదను ని న్నెక్కించుక కొల్చెద,
నీదు సన్నిధిని నిరతము నిల్చెద.

దయతో ఆనతియి"మ్మని గరుడుడు
దండముపెట్టగ, లక్ష్మినాథుడు
అట్లేయని ఆ గరుడుని శిరమున
అభయహస్తమిడి అదృశ్యుడయ్యెను.

అచ్చట నిల్చిన గరుడుని కనుగొని
అదె సమయంబని, దేవేంద్రుడు తన
వజ్రాయుధమును వైనతేయు పయి
వైచి, వికావిక నవ్వ దొడంగెను.

నిప్పులు చెరుగుచు వచ్చిన వజ్రము,
చప్పున గరుడుని రెక్కకు తాకెను:
తాకి నంతనే మొక్కపోయి, ఒక
ఈకను వంచగ లేకపోయినది!

ఆకాశమ్మున దేవ మునీంద్రులు
ఆ విధమంతయు కనుగొని మెచ్చిరి;
వినతాసుతునకు సుపర్ణు డనియెడు
వేఱొక పేరిడి వినుతి యొనర్చిరి.

ఇంద్రు డప్పుడు వైనతేయుని
ఏ విధంబున గెలువ లేమని
తలచి, ఆతని దరికి వచ్చెను,
చెలిమి గోరుచు చేయి జాపెను.




"వైనతేయా! శౌర్యవంతుడ
వైన నీ కీ అమృత మెందుకు?
పరుల కమృతము పోసి, వారిని
ప్రబల శత్రుల జేయు టెందుకు?

తిరుగ నాకీ అమృతమిచ్చిన
మఱచి పోవను నీదు మేలును,"
అని సురేంద్రుడు విన్నవింపగ,
అతని కిట్లని తెల్పె గరుడుడు:

"తల్లి దాస్యము తీర్చుటకు పెద
తల్లి కమృతము ఒసగవలయును;
అంతమాత్రమె దీనితో పని,"
అనిన ఇంద్రుడు మరల ఇట్లనె:

"నీవు దయతో సమ్మతించిన
నే నదృశ్యుడ నగుచు వచ్చెద ;
పరుల కిది చే జిక్కకుండగ
పట్టుకొని మా పురికి చేర్చెద."

అనిన గరుడుడు అట్లె రమ్మని,
అమృత భాండము ముక్కునం గొని,
చంద్రగోళము మీదుగా దిగి
సత్వరమ్ముగ మహికి చేరెను.

చేరి కద్రువ కూడిగంబులు
చేయుచుండిన తనదు తల్లిని
కాంచి, 'ఇదిగో! అమృతమమ్మా!'
యంచు పాదములంటి మ్రొక్కెను.

ఆమె నేత్రములందు ఆనం
దాశ్రుకణములు నిండిపోయెను ;
పొంగి పొర్లెడు గుండెతో తన
పుత్రు నర్మిలి కౌగిలించెను.

ధర్మదేవత లపుడు పువులా
తల్లికొడుకుల పైని చల్లిరి!

'వినత దాస్యము తొలగె'నని విను
వీధి బోరన మాఱుమ్రోసెను!

అమృత కలశము దర్భపై నిడి,
అందఱిని సెలవడిగి గరుడుడు
వీపుపై తన తల్లి నిడుకొని,
వెళ్ళిపోయెను సొంత యింటికి.

సుతులతో ఇంపార కద్రువ
శుచిగ అమృతము త్రాగదలచుచు,
స్నాన మాడుటకేగె—అయ్యది
సమయమని కనిపెట్టి ఇంద్రుడు—

అమృతభాండం బెత్తికొని త్రిద
శాలయమునకు చేరిపోయెను ;
శుచిగ వచ్చినయట్టి కద్రూ
సుతుల కాశాభంగ మాయెను.

అమృత కలశం బున్న చోటని
అచటి దర్భల నాకె పాములు ;
నాకినంతనె చీల్కలై తెగి
నాలుకలు రెండయ్యె వానికి!

* సంపూర్ణము *






## 24

[ కేశవుడూ, ఆతడి అనుచరుల్లూ కొండ గుహల్లో నివసించే జాతివాళ్ళకు, రెక్కల మనుషుల నుంచి రక్షణ కల్పిస్తామని, వాగ్దానం చేశారు. తరవాత రాత్రివేళ ఇద్దరు గుహావాసులను; తమ దేవతకు బలి యిచ్చేందుకు ఎత్తుకుపో ప్రయత్నిస్తున్న రెక్కల మనుషుల మీదికి, కేశవుడూ, జయమల్లూ, కోయగోమాంగ్ బాణాలు ఎక్కు పెట్టి వదిలారు. తరవాత-]

కేశవుడూ వాళ్ళు వదిలిన బాణాలు గురి తప్పి జుయ్‌ఁ మంటూ పెద్ద శబ్దం చేస్తూ పోయి బలంగా చెట్ల కొమ్మలను తాకినై. ఆ ధ్వని వింటూనే రెక్కల మనుషులు కిందికి దూకేవాళ్ళల్లా, గాలిలో ఆగి, "మోసం, నమ్మకద్రోహం!" అంటూ అరిచి, దూరంగా వున్న చెట్ల చాటుకు ఎగిరిపోయారు.

"ఆ దుర్మార్గులు, మన బాణం వేటు నుంచి చాలా దూరం పారిపోయారు. ఇప్పుడేమిటి చేయటం?" అన్నాడు కేశవుడు. జయమల్లు పొదలచాటు నుంచి లేచి నిలబడుతూ, "వాళ్ళు ఎంతో దూరం ఎగిరి పోయి వుండరని, నా నమ్మకం. వెతుకుదాం, రండి!" అంటూ బయలుదేరాడు. అంతలో ప్రాణాపాయం నుంచి బయటపడిన గుహావాసు లిద్దరూ అక్కడికి పరిగెత్తుకుని వచ్చి, "అయ్యా, ఆ రెక్కల మనుషులు ఆకాశంలోకి ఎగిరిపోయారు. కాని, అంతకన్న



దుర్మార్గులైన శ్వానకర్ణి ముఠావాళ్ళు మన కేసి వస్తున్నారు. మనం ప్రాణాలతో పారి పోలేం," అన్నారు.

శ్వానకర్ణి అన్నపేరు వింటూనే జయ మల్లు ఆశ్చర్య పడి, "ఎవడా శ్వానకర్ణి ? పేరు వింతగా వుందే! వాడి ముఠావాళ్ళు మన మీదికి ఎటు నుంచి దాడి చేసేందుకు వస్తున్నారు?" అని అడిగాడు.

గుహావాసులు జవాబు చెప్పే లోపలే, కోయగోమాంగ్ పక్కకు తిరిగి చూస్తూ, "అవిగో కాగడాలు! ఒక మందకు మంద మన కేసి వస్తున్నారు," అంటూ బాణం ఎక్కు పెట్టాడు. జయమల్లూ, కేశవుడూ అతడు చెప్పిన వైపుకు చూశారు. గుహా వాసుల్లాగే వున్న చాలామంది అడవి మనుషులు, ఈటెలు పట్టుకుని, కాగడాలు వూపుతూ నిశ్శబ్దంగా తమ కేసి రావటం వాళ్ళకు కనిపించింది.

జయమల్లు బాణం ఎక్కు పెట్టి వాళ్ళ కేసి కొంత దూరం నడిచి ఆగి, "మీరెవరో మాకు తెలియదు. మీకూ మాకూ ఎలాంటి శత్రుత్వం లేదు. మీ దారిన మీరు పొండి. అలా చేయక పోయారో, మీకు మా చేతుల్లో చావు తప్పదు," అన్నాడు. కేశవుడూ, కోయగోమాంగ్ కూడా బాణాలు ఎక్కు పెట్టి, అతడి పక్కన నిలబడ్డారు. గుహా వాసు లిద్దరూ వాళ్ళ వెనక దాక్కున్నారు.

కాగడాల వెలుగులో ముందు నడుస్తున్న ఒక అడవి మనిషి, చేతిలోని ఈటెను పై కెత్తి, "మీకూ మాకూ శత్రుత్వం లేని మాట నిజం. మీ దారిన మీరు పొండి. మాక్కావలసిం దల్లా, మీ వెంట వున్న, బిడాలి ముఠావాళ్ళు. వాళ్ళిద్దర్నీ మాకు ఒప్పగించండి," అన్నాడు.

ఎవరీ బిడాలి? అన్న అనుమానం జయ మల్లునూ, అతడి తోటి వాళ్ళనూ ఆశ్చర్యా పరిచింది. శ్వానకర్ణి, బిడాలి—ఎవరు వీళ్ళు? ఎందుకు వీళ్ళ మధ్య శత్రుత్వం?



"అయ్యా, బిడాలి మా నాయకుడు. ఇవ్వాళ ఉదయం వేళ ఆయన్ని మీరు చూశారు. మాలాగే ఈ శ్వానకర్ణి ముఠా వాళ్ళు కూడా కొండ గుహల్లో నివశించే జాతి వాళ్ళే. అయినా, వాళ్ళకూ మాకూ బద్ధవైరం. వాళ్ళకు మమ్మల్ని ఒప్ప చెప్పారో నిలువునా కోసి చంపేస్తారు," అన్నాడొక గుహావాసుడు, వణికిపోతూ.

"జయమల్లూ! మనం వీళ్ళను రక్షిస్తామని మాట యిచ్చాం. ఏమైనా సరే, ఆ మాట నిలబెట్టుకోవలసిందే," అన్నాడు కేశవుడు. కోయగోమాంగ్ తలాడించి, వింటి తాడు బలంగా లాగబోయాడు.



జయమల్లు అతణ్ణి వారిస్తూ, "కేశవా! మనం చేసిన వాగ్దానం నిలబెట్టుకోలేనంత పిరికిపందలం కాదు. కాని, పరిస్థితి చూశావా? మన విరోధులు నలభై యాభై మంది వరకూ వున్నారు. మనం వాళ్లందర్నీ చంపి పారిపోగలగటం సాధ్యమయేదికాదు," అన్నాడు.

"అయితే, ఏమిటి నీ ఆలోచన?" అన్నాడు కేశవుడు అనుమానంగా.

"రాజీ మాటలతో వాళ్ళను ముందుకు రాకుండా ఆపుదాం. అలా సాధ్యం కాకపోతే, అన్నిటికీ తెగించి పోరాటం చేద్దాం," అంటూ జయమల్లు ముందుకు రెండడుగులు



మీలో ఒక్కడూ బతకడు. మా బాణాల దెబ్బ మీకు తెలియదేమో? ఇంతకు ముందే యిద్దరు రెక్కల మనుషుల్ని చెట్ల మీంచి కింద పడేలా కొట్టాం," అంటూ జయమల్లు బాణం ఎక్కు పెట్టాడు.

ముగ్గురూ విల్లంబులతో ముందుకు నాలు గడుగులు వేసేసరికి, శ్వానకర్ణి అనుచరుడు వెనుదిరిగి, తన ముఠావాళ్ళతో ఏదో అన్నాడు. వెంటనే అందరూ అతడి చుట్టూ గుంపుగా చేరి గడబిడగా మాట్లాడుకోసాగారు.

"కేశవా! ఆ గొడవ చూశావా? మన మీద దాడి చెయ్యటమా? మానటమా? అన్న సమస్య తేలక వాళ్ళల్లోవాళ్ళే తన్ను కునేట్టున్నారు. ఇదే మంచి అదను. ఒక పేచీ వేసి చూస్తాను," అంటూ జయమల్లు అడవి మనుషుల కేసి తిరిగి, "మీలో చావ దలుచుకున్నవాళ్ళంతా ముందుకు రండి, తతిమ్మా వాళ్ళు వెనక్కు తిరిగి పొండి. మీ నాయకుడు శ్వానకర్ణి యీ సమయంలో యిక్కడ వుంటే, మాతో స్నేహానికి తప్పక ప్రయత్నించేవాడు. మీరు వట్టి మంద మతుల్లా వున్నారు," అన్నాడు.

జయమల్లు యిలా అనగానే, శ్వానకర్ణి అనుచరుణ్ణని చెప్పుకున్నవాడు తోటివాళ్ళను పెద్దగా కసురుకుని, జయమల్లు కేసి రెండడు

వేసి, "ఇప్పుడు మాట్లాడింది శ్వాన కర్ణియేనా? అలా అయితే, ఈటె అవతల పారేసి, ఒక్కడూ ముందుకు రాకోరతాను. ఇదుగో, నా విల్లంబులు వదిలేశాను," అంటూ తన విల్లంబులను కింద పడవేశాడు.

"శ్వానకర్ణి మా నాయకుడు. ఆయన గుహ దగ్గిరే వున్నాడు. నేనాయన అను చరుణ్ణి. కాలయాపనెందుకు? ఆ బిడాలి ముఠా వాళ్ళిద్దర్నీ వదిలి, మీ దారిన మీరు పొండి," అన్నాడు శ్వానకర్ణి అనుచరుడు.

"అలా ఎన్నటికీ జరగదు. వాళ్ళిద్దర్నీ మీరు పట్టుకోవాలంటే, ముందు మాతో యుద్ధం చేయాలి. అందుకు తయారయారో,

గులు నడిచి, "మీరు కావాలంటే మా నాయకుడితో స్వయంగా మాట్లాడ వచ్చు. భయం లేకపోతే, మా వెంట రండి, ఆయన వుండే గుహకు తీసుకుపోతాం," అన్నాడు.

భయం అన్న మాట వింటూనే కేశవుడికి ఎక్కడలేని పౌరుషం వచ్చింది. వాడు వింటి తాడును గట్టిగా లాగి మోగిస్తూ, "మేము కావాలంటే మీ నాయకుడి దగ్గిరకే కాదు, అతడి ముత్తాత దగ్గిరకైనా వస్తాం, నడవండి," అన్నాడు తీవ్రంగా.

జయమల్లుకు, కేశవుడు అనాలోచితంగా మాట జారాడేమో అన్న భయం కలిగింది. కాని, యిప్పుడు అన్న మాట మీద నిలవక తప్పదు. మాట తప్పితే, తాము భయపడు తున్నామనుకుని, ఆటవికులు ఒక్కుమ్మడిగా మీద పడవచ్చు......

జయమల్లు యిలా ఆలోచిస్తూనే వెను దిరిగి, వెనక నిలబడి వున్న గుహావాసుల్లో ఒకడికి, అక్కణ్ణించి పారిపోయి, జరిగిన సంగతేమిటో తమ నాయకుడైన బిడాలికి చెప్పమన్నాడు. రెండవవాణ్ణి తమ వెంటే వుండమన్నాడు. అంతలో శ్వానకర్ణి అను చరుడు పెద్దగా గొంతెత్తి, "మీ రన్నదే బావుంది. మా వెంట రండి. మా నాయకుడితో మాట్లాడుదురు గాని. ఆయన



మిమ్మల్ని మీ దారిన పొమ్మంటే పోవచ్చు. అనవసరంగా మీరూ మేమూ, ఆ బిడాలి ముతా వెధవ లిద్దరి కోసం యిక్కడ చావట మెందుకు?" అన్నాడు.

"సరే, మీరు ముందు నడవండి. మీ గుహలుండే చోటు చేరేవరకూ, మీకూ మాకూ యిప్పుడున్న దూరమే వుండాలి. ఏదైనా మోసం చేయ చూస్తే, మీలో ఒక్కడు కూడా బతకడు," అన్నాడు జయమల్లు.

ఆ తరవాత అంతా ముందుకు కదిలారు. ఒక అరగంట కాలం ప్రయాణం చేసి ఎత్తయిన కొండలు గల ఒకానొక ప్రాంతాన్ని చేరారు. అప్పటికి తూర్పు దిక్కు కొంచెం

కొంచెమే తెల్లనవుతున్నది. ఆ వెలుగులో జయమల్లుకూ, అతడి అనుచరులకూ ఎగుడు దిగుడుగా వున్న కొండలూ, వాటి అంచుల మీద నిలబడి వున్న గుహావాసులూ కనిపించారు. అందరూ ఆ ప్రదేశానికి చేరుతూ వుండగానే, పై నుంచి పెద్దపెద్ద కొండరాళ్ళు దొర్లి, కేశవుడూ వాళ్ళకేసి రాసాగినై. అది చూస్తూనే ముందున్న శ్వానకర్ణి అనుచరులు కేకలు పెడుతూ కొండ మీదికి పరిగెత్తారు.

ముందు నడుస్తున్న జయమల్లు ఆగి, "గోమాంగ్! అదిగో, ఆ కుడివైపున వున్న బండ మీద ఎలుగుచర్మం కప్పుకుని నిలబడి వున్నవాడే శ్వానకర్ణి అయివుంటాడు. వాడికి బాణం గురిచేసి పెట్టు. కాని, నేను వదలమనేవరకూ వదలవొద్దు," అని చెప్పి, ముందుకు రెండడుగులు వేసి, "శ్వానకర్ణీ! మీరేదో నమ్మక ద్రోహం తలపెట్టినట్టున్నది. అలా అయితే ముందు చావ నున్నది, నీవు! చూశావా? నీ గుండెలకు బాణం ఎక్కుపెట్టి వున్నది. పారిపోయేందుకు ప్రయత్నించావో, బాణం నీ గుండెలలో నుంచి దూసుకు పోతుంది," అని కఠినంగా హెచ్చరించాడు.

జయమల్లు హెచ్చరిక పూర్తయే లోపలే శ్వానకర్ణి ముఠావాళ్ళు వాళ్ళ మీదికి కొండ రాళ్ళు దొర్లించటం ఆపేశారు. అంతలో



శ్వానకర్ణి అనుచరుడు, తమ నాయకుణ్ణి సమీపించి, జయమల్లూ వాళ్ళను చూపుతూ ఏమో చెప్పాడు. నాయకుడు అటూ యిటూ రెండు మూడుసార్లు తలాడించి, జయమల్లు కేసి తిరిగి పెద్ద గొంతుతో, "మీరు మా శత్రువులకు మిత్రులు, కనక—మాకు శత్రువులు. మీరు మా నుంచి ప్రాణాలతో పారిపోలేరు," అన్నాడు.

ఆ మాటలు వింటూనే కేశవుడు విల్లు పైకెత్తి, "ఊఁ మల్లూ! యిక లాభం లేదు. ఆ శ్వానకర్ణినీ మరి కొందర్నీ కొట్టి పారిపోదాం. బాణం ఎక్కుపెట్టు," అన్నాడు.

జయమల్లు, కేశవుణ్ణి తొందర పడవద్దని వారించి, "కేశవా! మనం ఈ ప్రాంతాలకు కొత్తవాళ్ళం. ఇక్కడ నివసించే అడవిజాతి వాళ్ళందరితో వైరం పెట్టుకుని ఎక్కడికి పారిపోగలం? మనం పుట్టి పెరిగిన రాజ్యం వదిలినది మొదలు దారి పొడుగునా ప్రతి వాళ్ళతో విరోధం తప్ప, ఒక్కళ్ళతో కూడా మనకు స్నేహం కలవ లేదు. పులి మీద పుట్రలాగా, బ్రహ్మదండి మాంత్రికుడు మనను వెన్నాడే వుంటున్నాడు. మనం ఈ గుహవాసులతో మైత్రి చేయగలిగితే, వీళ్ళ నుంచి రాకాసిలోయకు వెళ్ళే మార్గం తెలుసుకునే అవకాశం కలగవచ్చు. అంతే




కాక, నీ తండ్రి ఒకవేళ ఈ ప్రాంతానికి వస్తే, అతడికి వీళ్ళు సహాయపడే వీలుకూడా వుంటుంది," అన్నాడు.

తండ్రి పేరు వింటూనే కేశవుడు వెలవెలపోయి, విల్లంబులు దించుతూ, "కాని, వీళ్ళతో స్నేహం చేయటం ఎలా? వీళ్ళు పచ్చి మాంసం తినే ఆటవికులు!" అన్నాడు.

"అదంతా నాకు వదిలెయ్యి. రెక్కల మనుషుల్నుంచి రాబోయే ప్రమాదం చూపి, ఆ బిడాలికీ, ఈ శ్వానకర్ణికి మైత్రి కలిగించేందుకు ప్రయత్నిస్తాను. వాళ్ళూ వీళ్ళూ కూడా కొండ గుహల్లో నివసించే వాళ్ళేగదా," అంటూ జయమల్లు శ్వానకర్ణి కేసి తిరిగి,

"శ్వానకర్ణీ! మేం నీ బెదిరింపులకు భయపడే వాళ్ళం కాదు. బిడాలి ముఠావాళ్ళను రెక్కల మనుషుల నుంచి కాపాడతామని వాగ్దానం చేశాం. ఆ రెక్కల మనుషుల్ని పదీ పన్నెండు మందిని చంపాం కూడా. మీరూ మీరూ పోట్లాడుకుంటూ వుంటే, ఆ దుర్మార్గులు నీ ముఠావాళ్ళను కూడా ఏదో ఒక రోజున ఎత్తుకు పోవటం మొదలు పెడతారు. ఇంతకూ—నీకూ ఆ బిడాలికీ వైరకారణం ఏమిటి?" అని అడిగాడు.

"వైర కారణమా? ఆ బిడాలి తండా వాళ్ళంత నీచులు ఎక్కడా వుండరు. నేను గుహలో లేని సమయం చూసి, వాళ్ళు మా మూల పురుషుడి రాతి గద ఎత్తుకుపోయారు. అది ఎన్నో మహత్తర శక్తులు గలది. అది తిరిగి సంపాయించుకునేందుకు, వాళ్ళ నందర్నీ సర్వనాశనం చేయబోతున్నాను," అన్నాడు శ్వానకర్ణి పళ్ళు కొరుకుతూ.

"ఆ రాతి గద బిడాలి తెచ్చి నీ కిచ్చేస్తే, మీ మధ్య వైరం పోయినట్టేనా?" అని ప్రశ్నించాడు జయమల్లు.

శ్వానకర్ణి హేళనగా నవ్వుతూ, "బిడాలి ఆ గద తెచ్చి నా కివ్వటమా? అదెలా సాధ్యం? ఆ గద కోసం వాడు ఎన్ని చావులైనా చస్తాడు; తన ముఠావాళ్ళనందర్నీ చావనిస్తాడు," అన్నాడు.

"బిడాలి రహస్యం నాకు తెలుసు. మీ మూల పురుషుడి రాతి గద బిడాలి చేత తెప్పించి, నీ కిప్పిస్తాను," అంటూ జయమల్లు, వెనక నిలబడి వున్న బిడాలి ముఠా వాడి కేసి తిరిగి, "అంతా విన్నావుగదా? వెంటనే వెళ్ళి, మీ నాయకుణ్ణి రాతి గద తీసుకుని యిక్కడికి రమ్మన్నానని చెప్పు. అతడి కొచ్చిన ప్రాణభయం ఏమీ లేదు," అన్నాడు. బిడాలి అనుచరుడు వెంటనే బయలుదేరి వెళ్ళాడు. —(ఇంకా వుంది)






# పునర్జన్మ

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవం లోని బేతాళుడు, "రాజా, నీ ధైర్య సాహసాలకూ, ఓర్పుకూ, పట్టుదలకూ ఎంత గొప్ప ఫలితం వుంటుందో ఊహించలేకుండా ఉన్నాను. వెనకటికి కైరభు డనే సామాన్య సైనికుడు దాదాపు ఇలాటి పరిస్థితిలోనే చిక్కుకుని, నీ కన్న తక్కువ ధైర్యమే ప్రదర్శించి నప్పటికీ, అందుకు ప్రతిఫలంగా రాజ కుమార్తెను పెళ్లాడాడు. నీకు శ్రమ తెలియకుండా ఉండగలందులకు అతని కథ చెబుతాను విను," అంటూ ఈవిధంగా చెప్పసాగాడు:

ఒకానొక దేశంలో ఒక రాజుండేవాడు. ఆ రాజుకు పిల్లలు కలగలేదు. ఆయన ఒకవంక సంతాన వాంఛతో బాధపడు తూంటే, ఆయన వద్ద కొలువు చేసేవారు,

బేతాళ కథలు



"మహారాజా, తమ అనంతరం మమ్మల్ని పాలించే దెవరు? మీ కడుపున ఒక నలుసు కలగకపోతే మాకు ఏమిటి భవిష్యత్తు?" అంటూ రాజును మరింతగా పీడించారు.

దీనితో రాజు మరింత బాధపడి, "వికృతాకారమైనా ఫరవాలేదు, నా బిడ్డ అంటూ ఒక్క నలుసు పుడితే నే నెంత సంతోషిస్తాను!" అన్నాడు.

రాజు ఈ మాట అన్న తరవాత రాణి గర్భవతి అయి, సకాలంలో ఒక ఆడపిల్లను కన్నది. ఆ పిల్ల అందమైనదే, అన్ని లక్షణాలూ కలిగినదే—అయితే కారునలుపు! మహారాజుకు సంతోషమూ, దుఃఖమూ



కూడా కలిగాయి. ఆయన రాణితో, "ఇదేదో శాపం! ఏమైనా ఇది మనపిల్ల. అందులోనూ లేకలేక కలిగినది. దీనితోనే మనం సంతృప్తి పడాలి. దీనికే మనము అచ్చట్లూ, ముచ్చట్లూ చేసుకోవాలి," అన్నాడు.

ఆయన తన కుమార్తె కోసం ఒక ప్రత్యేకమైన భవనం కట్టించి, దాన్ని రాజోచితంగా అలంకరింపజేసి, పిల్లను సాకటానికి అవసరమైన దాదులనూ, నౌకర్లనూ ఏర్పాటు చేశాడు. తరవాత ఆయన తన రాజ్యంలోని పండితులనూ, జ్యోతిష్కులనూ, మంత్రవేత్తలనూ, జ్ఞానులనూ సమావేశ పరిచి, "నా కుమార్తెకు గర్భవాసానే ఏదో విచిత్రమైన దోషం సంక్రమించింది. ఇలాటిది పూర్వం ఎక్కడైనా జరిగిందా? దీనికి విరుగుడు ఏమిటి? మీమీ బుద్ధి చాతుర్యమంతా వినియోగించి ఈ పీడ విరగడ అయే మార్గం ఆలోచించండి," అన్నాడు.

అందరూ తలా ఒక మాటా చెప్పారు. జ్యోతిష్కులు గ్రహదోషమన్నారు. మంత్రవేత్తలు దుష్ప్రయోగ మన్నారు. తత్వవేత్తలు ప్రారబ్ధమన్నారు. గ్రహశాంతులూ, మంత్రోచ్చాటనలూ కొంచెంకూడా పని చెయ్యలేదు. ఒక ముసలిది రాజుగారి దగ్గిరికి పనిపెట్టుకుని వచ్చి, "బాబూ,





అమ్మాయికి పద్దెనిమిదో ఏట ప్రాణగండం ఉన్నది. ఆ గండం గడిచి బయటపడ్డాక మామూలు మనిషి అవుతుంది. మీరేమీ విచారించకండి," అని చెప్పి తన దారిన తాను వెళ్ళిపోయింది.

రాజకుమార్తె ఆ రోజు కా రోజు మరింత అందంగా పెరుగుతూ వచ్చింది. కాని ఆ పాదమస్తకమూ బొగ్గునలుపు కావటం చేత ఆమె చక్కదనం ఏమాత్రమూ రాణించలేదు. అయితే ఆమె శరీరచ్ఛాయకు రాజూ, రాణీ, దాసీలూ అలవాటు పడిపోయారు. ఆమె స్వభావం చాలా మృదువైనది. అందుచేత ఆమెను అందరూ ఎంతో ప్రేమతోనూ, అభిమానంతోనూ చూసేవారు.

ఇలా ఉండగా రాజకుమార్తెకు పదిహేడేళ్ళు నిండి పద్దెనిమిదో ఏడు వచ్చింది. ఆమెకు పుట్టినరోజు పండగ మహా వైభవంగా చేశారు. అది జరిగిన మర్నాడే ఆమెకు విచిత్రమైన వ్యాధి ఏదో కలిగింది. ఆమె తన తండ్రిని పిలిచి, "నాన్నా, నేనింక బతకను. అయినా, చచ్చిపోయినాక నన్ను పాతెయ్యవద్దు, ఒక పెట్టెలో పెట్టి, మన వంశం వారి కోసం సమాధులు కట్టే ప్రత్యేకావరణలో ఉంచి, ఆ ఆవరణలో ఒకే ఒక సామాన్య సైనికుణ్ణి ప్రతి రాత్రీ కాపలా ఉంచుతూ ఉండండి," అని చెప్పి, ప్రాణాలు విడిచింది.

రాజకుమార్తె శవాన్ని ఒక పెట్టెలో ఉంచి మేళతాళాలతో రాజ సమాధులుండే శ్మశానానికి తీసుకు వెళ్ళారు. ఆ పెట్టెను అక్కడ ఉన్న మండపాలలో ఒకదాని మీద ఉంచేశారు. శ్మశానంలో శవానికి కాపలా ఉండటానికి రాజకుమార్తె అడిగినది సామాన్య సైనికుణ్ణే అయినప్పటికీ, రాజుగారు ఆరాత్రి కాపలాకు తన అంగరక్షకుల లోని ఒక యోధుణ్ణి పంపాడు. అతన్ని రాజభటులు శ్మశానం దాకా సాగనంపి తిరిగి వచ్చేశారు. ఆ యోధుడు ఆవరణ తలుపులు మూసి,

లోపల రాజకుమార్తె శవం ఉన్న మండపం మెట్ల మీదనే కూచున్నాడు.

సరిగా అర్ధరాత్రి వేళ శవం ఉన్న పెట్టె యొక్క మూత దఢాల్న తెరుచుకున్నది. రాజకుమార్తె అమాంతంగా యోధుడి పైన పడి గొంతు నులిమేసి, వికృతంగా గోరీల మధ్య నృత్యం చేసి, కేకలుపెట్టి, కోడి కూసే వేళకు తన పెట్టెలోకి తిరిగి వెళ్ళిపోయింది. దీనికి కారణమేమంటే ఆమెలో బేతాళుడు ప్రవేశించాడు.

తెల్లవారినాక రాజభటులు వచ్చారు. శ్మశానంలోకి ప్రవేశిస్తూనే వాళ్ళు యోధుడి శవాన్ని చూశారు. ఈ వార్త విని రాజు కుంగిపోయాడు. అయినా రెండవ రాత్రికి ఆయన మరొక యోధుణ్ణి కాపలాకు పంపాడు. వాడు కూడా బేతాళుడికి ఎర అయాడు.

రాజు మంత్రులతో సమాలోచన జరిపాడు. "పుట్టిననాటి నుంచీ రాజకుమార్తెను ఏదో ఆవహించి ఉన్నది. అది ఏ బ్రహ్మ రాక్షసిగాని అయి ఉంటుంది. చనిపోయినాక ఆమెను దహనం చెయ్యటమో, పూడ్చి పెట్టటమో చేసినట్టయితే ఈ ప్రమాదం కలిగేది కాదు. ఇప్పటికైనా మించిపోలేదు-" అన్నారు మంత్రులు.

రాజుకు ఈ ఆలోచన నచ్చలేదు. తన కుమార్తె ఆఖరు క్షణంలో కోరిన కోరిక



నెరవేర్చకుండా ఉండటం ఆయనకు సాధ్యంకాలేదు. ఆయన తన సేనానాయకుణ్ణి పిలిచి, "ధైర్యసాహసాలు గల సైనికులను ఏరి నా వద్దకు పంపండి," అన్నాడు.

పదిమంది సైనికులు రాజుగారి వద్దకు వచ్చారు. ఆయన వారితో, "మీలో ఎవరు ఈ రాత్రికి శ్మశానంలో కాపలా కాస్తారు? ఇది మామూలు కాపలా కాదు, ప్రాణాపాయకరమైనది. ప్రాణాలు దక్కించుకోగలిగిన సైనికుడికి అర్ధరాజ్యమైనా ఇస్తాను," అన్నాడు.

ఆ సైనికులలో కైరభుడనేవాడు, "మహారాజా, నన్ను కాపలాకు పంపండి," అన్నాడు.

ఈ కైరభుడు పరమ సాహసి. జీవితం మీద రోతగలవాడు. యుద్ధానికి పంపితే యుక్తీ, నేర్పరితనమూ పాటించకుండా శత్రువుల పైకి లంఘించి మొండిగా ఊచకోత కోసేవాడు. ఎన్నోసార్లు వాడు తన ప్రాణం మీదికి తెచ్చుకుని, ఆయుర్దాయం ఉండటంచేతనే ప్రాణాలతో బయట పడ్డాడు. నిత్యజీవితంలో కూడా వాడు అలాగే ప్రవర్తించేవాడు. వాడికి జూదమంటే ఇష్టం. కాని తన దగ్గిర ఉన్నదంతా ఒక్కసారే పణం పెట్టి క్షణంలో పోగొట్టుకునేవాడు. అందుచేత వాడికి జీవితంలో ఆనందం లేదు. జూదగాడి మనస్తత్వంతోనే వాడు





కాపలాకు ఒప్పుకున్నాడు. వస్తే అర్ధరాజ్యం వస్తుంది, పోతే ప్రాణం పోతుంది!

మూడోనాటి రాత్రి రాజభటులు కైరభుణ్ణి శ్మశానం దాకా తీసుకుపోయి వెనక్కు వెళ్ళిపోయారు. నిర్జనమైన ప్రదేశం-కటిక చీకటి-రాజకుమార్తె శవంలో ఏదో భూతం! ఇవన్నీ తలుచుకుంటే కైరభుడికి జన్మలో మొదటి సారిగా భయం పట్టుకున్నది. శత్రువులతో పోరాడటం వేరు; వాళ్ళు మనుషులు. బ్రహ్మరాక్షసితో ఎట్లా పోట్లాడటం?

కైరభుడు తిన్నగా ఇంటికి పోవటానికి నిశ్చయించాడు. శ్మశానంలో కాపలా కాయలేదంటే రాజుగారు రేపు తన తల తీయ



వచ్చు-మరొక శిక్షతో పోనియ్యవచ్చు. కాని కాపలా కాస్తే ఒక అర్ధరాత్రి వేళ తన చావు తథ్యం.

ఇలా అనుకుని కైరభుడు శ్మశానద్వారం నుంచి వెనక్కు తిరిగి నాలు గడుగులు వేసేసరికి, అతని దారికి అడ్డంగా ఒక తెల్లని ఆకారం కనిపించింది. తెల్లటి బట్టలూ, తెల్లటి పొడవైన గడ్డమూ కలిగి ఎవరో మునిలాగున్నాడు.

"వెళ్ళి పోతున్నావేం, నాయనా?" అన్నాడా ముని.

"చావటం ఇష్టంలేక," అన్నాడు కైరభుడు.

"వెర్రివాడా, నీవు చావవు. నేను చెప్పినట్టు చెయ్యి. ఈ విభూతి తీసుకో. అర్ధరాత్రి అయేసమయానికి రాజకుమార్తె శవం ఉన్న పెట్టె పక్కనే, దాని మూత తెరుచుకునే వైపుగా పడుకో. రాజకుమార్తె పెట్టెలో నుంచి పైకి వస్తూ నిన్ను చూడలేదు. ఆమె నీ కోసం శ్మశానం అంతటా వెతుకుతుంది. ఈలోపుగా నీవు ఆ పెట్టెలో ఈ విభూతి చల్లి అందులో పడుకో. రాజకుమార్తె పెట్టె వద్దకు తిరిగి వచ్చి, నిన్ను బయటికి రమ్మంటుంది. నీవు మాత్రం కదలకు. ఆమె పలకరిస్తే పలకకు. ఆ పలకరించేది బేతాళుడు.

బేతాళు డామెను వదిలి వెళ్ళినట్టు రూఢి అయేదాకా నీవు కదలకు, పలకకు, పెట్టెలో నుంచి పైకి రాకు. తొలికోడి కూసినాక నీకు బేతాళుడి భయం ఉండదు. వెళ్ళు! వెళ్ళి కాపలా కాయి!" అంటూ ఆ ముని కైరభుడి చేతిలో ఇంత విభూతి పెట్టాడు.

కైరభుడికి పోయిన ధైర్యం తిరిగి వచ్చింది. అతను నిశ్చింతగా పాటలు పాడు కుంటూ చాలాసేపు శ్మశానం అంతటా తిరి గాడు. ఆకాశాన నక్షత్రాలు అర్ధరాత్రి కావస్తున్నదని సూచించగానే అతను మండపం మీదికి వెళ్ళి శవం ఉన్న పెట్టె పక్కనే పడుకున్నాడు. సరిగా అర్ధరాత్రి వేళ పెట్టె మూత దఢాల్న తెరుచుకున్నది. రాజకుమార్తె తుఫాను వేగంతో పెట్టె నుంచి పైకి వచ్చి, మండపం మీది నుంచి కిందికి ఒక్క దూకు దూకి కాపలావాడి కోసం అంతటా వెతకసాగింది. మామూలుగా ఎంతో సౌమ్యంగా ఉండే ఆమె ముఖం భయం కరంగా ఉన్నది. ఆమె కళ్ళు చింత నిప్పుల్లాగా మండుతున్నాయి.

కైరభుడు చప్పున తాను దాగిన చోటి నుంచి లేచి, తన చేతిలో ఉన్న విభూతి పెట్టెలో చల్లి, రాజకుమార్తె శవం స్థానంలో తాను పడుకున్నాడు.



రాజకుమార్తె రంకెలు పెడుతూ శ్మశానం అంతటా చాలాసేపు వెతికింది. మధ్యమధ్య, "ఆకలి! ఆకలి!" అని కేకలు పెట్టింది. "ఎక్కడున్నావ్? రా బయటికి! నిన్ను నేను పట్టుకోలే ననుకున్నావా?" అంటూ సమాధులన్నిటి వెనకా మళ్ళీ మళ్ళీ వెతి కింది. చివరకామె ఒక్క ఎగురు ఎగిరి మండపం మీదికి వచ్చి పెట్టెలో పడుకుని ఉన్న కైరభుణ్ణి చూసి, "ఇక్కడున్నావా? రా ఇవతలికి. అది నా ఇల్లు!" అన్నది. ఆమె కంఠధ్వని కర్కశంగా ఉన్నది.

కైరభుడు కదలలేదు, మెదలలేదు. రాజ కుమార్తె అతనిని ఎన్నో ప్రశ్నలు వేసింది.

ఒక్కదానికీ అతను జవాబు చెప్పలేదు. అతన్ని భయపెట్టింది. అతన్ని పట్టుకుని బయటికి లాగే దానిలా అభినయించింది. కైరభుడు చలించలేదు.

క్రమంగా అమె కంఠధ్వనిలో కర్క శత్వం తగ్గిపోతూ ఉండటం గమనించి కైరభుడు తన కళ్ళు సగం తెరిచి ఆమె కేసి చూశాడు. నల్లగా ఉండవలిసిన ఆమె ముఖం తెల్లగా అయింది. ఆమె మెడమీది నలుపురంగు విరుగుతూ ఉండటం అతనికి కనిపించి పట్టరాని ఆనందం కలిగింది.

అయినప్పటికీ అతన్ని ఎలాగైనా మాట్లా డించటానికి ఆమె ఇంకా ప్రయత్నిస్తూనే ఉంది. ఆ ప్రయత్నం చేస్తున్నది ఓడి పోతున్న బేతాళుడని కైరభుడు గ్రహిం చాడు. ఆమె కంఠస్వరం క్రమంగా శ్రావ్యంగా మారటంకూడా అతను గమనిం చాడు. తొలికోడి కూసిన దాకా అతను ఆ పెట్టెలో కళ్ళు మూసుకుని పడుకున్నాడు. కోడి కూత వింటూనే అతను కళ్ళు తెరిచి చూశాడు. రాజకుమార్తె నిలువునా పాలరాతి బొమ్మలాగా తయారై ఉన్నది. ఆమె వంగి అతని చెయ్యి పట్టుకుని పైకి లాగుతూ, "నన్ను కాపాడావు. ఇంక లే!" అన్నది ఎంతో ప్రేమగా. తెల్లవారి రాజభటులు వచ్చేసరికి కైరభుడూ, రాజకుమార్తే మంటపం మెట్ల



మీద కూచుని కబుర్లు చెప్పుకుంటూ కని పించారు. కైరభుడు ప్రాణాలతో ఉండటం కన్నకూడా, రాజకుమార్తె బతికి ఉండ టమూ, ఆమె శరీరం నలుపు విరిగి తెల్లగా ఉండటమూ వారిని ఎక్కువ ఆశ్చర్య పరి చింది. రాజుగారూ, ఆయన అనుచరులూ పొందిన ఆనందానికి హద్దేలేదు. రాజుగారు సభలో కైరభుణ్ణి ఉగ్గడిస్తూ, "ఇతనికి కాపలా కాసినందుకే అర్ధ రాజ్యం ఇస్తా నన్నాను. నాకుమార్తెకు శాపవిముక్తి కలి గించి ప్రాణదానం కూడా చేశాడు. అందు చేత ఇతన్ని ఎలా బహూకరించాలని మీరు సలహా ఇస్తారు?" అని అడిగాడు.

"సాధారణ సైనికుడు, అర్ధ రాజ్యం తీసుకుని ఏలటానికి కూడా అర్హుడుకాడు. అతని శక్తికి తగినట్టుగా బహూకరించండి, చాలు!" అని మంత్రులు మొదలైనవారు సలహా ఇచ్చారు.

చాటున ఉండి ఈ చర్చ వింటున్న రాజకుమార్తె సభలోకి వచ్చి, "మీరు చాలా పొరబడుతున్నారు. నన్ను బేతాళుడి నుంచి కాపాడిన అతని శక్తి మీ కన్న నాకు బాగా తెలుసు. నేను అతన్ని పెళ్ళాడబో తున్నాను. నన్ను అతని కిచ్చి పెళ్ళిచేసి రాజ్యమంతా ఇవ్వండి. అదే అతనికి సరి అయిన బహుమానం," అన్నది.



రాజకుమార్తె అలా నిండు సభలో అన్నాక ఆమెకు ఎదురాడే శక్తి ఎవరికీ లేక పోయింది. తన కుమార్తె కోసం ఏమి చెయ్యటానికైనా సిద్ధంగా ఉన్న రాజు కైరభుడికి తన కుమార్తె నిచ్చి పెళ్ళి చేసి, రాజ్యాభిషేకం కూడా చేశాడు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, రాజకుమార్తె తన స్థాయిని మరిచిపోయి ఒక సామాన్య సైనికుణ్ణి ఎలా ప్రేమించింది? తనను బేతాళుడి నుంచి కాపాడాడన్న కృతజ్ఞత వల్లనా? లేక అతని ధైర్యానికి మెచ్చుకునా? ఈ నా సందేహానికి జవాబు తెలిసికూడా చెప్పకపోయావో నీ తల పగిలి పోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "రాజకుమార్తెకు కైరభుడి ధైర్యం చూసి ఆనందం కలిగి ఉండవచ్చు, తనను కాపాడాడని కృతజ్ఞత కూడా ఉండవచ్చు. కాని ఆమె అతన్ని ప్రేమించటానికి వేరే కారణం ఉన్నది. రాజకుమార్తెగానే ఉన్నట్టయితే ఆమెకు కైరభుణ్ణి ప్రేమించాలన్న ఆలోచన కలిగేది కాదేమో; కాని ఆమె రాజకుమార్తెగా చని పోయి తిరిగి పునర్జన్మ ఎత్తింది. ఈ కొత్త జన్మలో ఆమెకు అప్పుడు కైరభుడు. జన్మతో ఏర్పడే సంబంధాలను ఎవరూ విమర్శించరు. తల్లిదండ్రులను పిల్లలూ, పిల్లలను తల్లిదండ్రులూ మనస్ఫూర్తిగా ఆమోదిస్తారు. ఇందుకు రాజే తార్కాణం. లేక లేక కలిగిన కుమార్తె కారునలుపైనా ఆయన ఆమోదించి ఆమె కోసం ఎంతో ప్రయాసపడ్డాడు. అలాగే రాజకుమార్తె కూడా పునర్జన్మ ద్వారా లభించిన కైరభుణ్ణి ఆమోదించింది. ఆమె యుక్తవయస్కురాలై ఉండటాన ఆమెకు అతనిపై కలిగిన మమకారం ప్రేమగా రూపొందింది," అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. (కల్పితం)





# ముక్కు సూటిగా

జమీందారుగారి గ్రామానికి పది మైళ్ళ దూరంలో శ్రీపురం అనే గ్రామంలో దేవీ నవరాత్రులు జరిగేటప్పుడు అమ్మవారి దేవాలయంలో జమీందారుగారి తరఫున కూడా అర్చన జరగటం రివాజు. అర్చన చేయించటానికి జమీందారుగారు స్వయంగా వెళ్ళకపోయినా ఎవరినో ఒకరిని పంపుతూండే వారు. ఆ పని ఈసారి భీమన్న పైన పడింది.

"భీమన్నా, ఇవాళ నువ్వు బండిలో శ్రీపురానికి వెళ్ళి మన పేర అమ్మవారికి అర్చన చేయించి సాయంకాలానికల్లా తిరిగి రావాలి," అని జమీందారుగారు అల్లుడితో చెప్పాడు. బండీలో పళ్ళూ, టెంకాయలూ, ఇతర పూజా ద్రవ్యాలూ పెట్టారు. భీమన్న ఎక్కి కూచున్నాడు. బండి కదిలింది.

కొంతదూరం వెళ్ళినాక బండివాడు బండి నిలిపి, "బాబూ, ఒక్క క్షణం ఉండండి. ఇప్పుడే మా యింటికి వెళ్ళి నేను కూడా ఒక టెంకాయ తెచ్చి అమ్మవారికి కొడతాను," అని కొంత దూరంలో ఉన్న తన ఇంటి కేసి పరిగెత్తాడు.

భీమన్న ఎన్నడూ బండి తోలలేదు. బండివాడు వెంటనే వస్తానన్నాడుగదా, బండిని నింపాదిగా నడిపిద్దామనుకుని భీమన్న పగ్గాలు ఒక చేత పట్టుకుని, రెండో చేత్తో చరణాకోల పుచ్చుకుని ఎడ్లను అదిలించాడు. ఎద్దులు వేగంగా కదిలాయి. "మెల్లిగా! మెల్లిగా!" అని భీమన్న అంటున్నా అవి వినిపించుకో లేదు. భీమన్నకు కోపం వచ్చి చరణాకోలతో ఎద్దులను గట్టిగా వేశాడు. అవి మరింత వేగంగా పరిగెత్తాయి. వాటి పరుగు హెచ్చిన కొద్దీ భీమన్న కోపం కూడా హెచ్చింది. అతను అరిచాడు, ఎడ్లను చావ గొట్టాడు. దారీ తెన్నూ చూడకుండా అవి గుర్రాలతో



సమంగా దౌడు తీశాయి. శ్రీపురం దారి ఎటో, బండి ఎటుకేసి పోతున్నదో కూడా భీమన్నకు తెలియరాలేదు.

అంతలో భీమన్నకు పగ్గాలు బిగలాగాలని తట్టింది. బండిని ఆప దలిచినప్పుడు బండి వాడు పగ్గాలు లాగి, "హెూ! హెూ! హెూ!" అంటాడని భీమన్నకు గుర్తు వచ్చింది. అదే ప్రకారం భీమన్న కూడా పగ్గం గట్టిగా బిగ లాగి, "హెూ! హెూ! హెూ!" అన్నాడు. దురదృష్టవశాత్తూ భీమన్న ఒకే పగ్గం లాగటం చేత ఎద్దులు పక్కకు తిరిగి, దారి పక్కనే ఉన్న కాలవలోకి తిన్నగా దిగి ఆగిపోయాయి.

అంత దూరాన కాలవలో బట్టలు ఉతుకు తూన్న చాకలి ఒకడు ఇదంతా చూసి పరిగెత్తుకుంటూ వచ్చి, "ఏం బాబూ? బండిని కాలవలోకి తోలేశారేమిటి?" అని భీమన్నను అడిగాడు.

"కావాలనే తోలాను! కళ్ళు కనిపించటం లేదా? ఎడ్లకు దప్పిక అయింది. నీళ్ళు తాగుతున్నాయి చూడు," అన్నాడు భీమన్న.

భీమన్న మాట పూర్తి కాకుండానే ఎద్దులు నీళ్ళు తాగటం మానేశాయి. బండిని కాలవలో నుంచి బాట మీదికి ఎక్కించటం భీమన్నకు సాధ్యం కాలేదు. చాకలివాడే సహాయం చేసి బండిని దారి మీదికి తెచ్చాడు.

"చూడూ! శ్రీపురానికి దారి ఎటూ?" అని భీమన్న చాకలిని అడిగాడు.

"శ్రీపురానికి వెళ్ళే పనయితే ఇటు రానే కూడదు. ఈ దారిన తిన్నగా వెనక్కు పోతే కొంతదూరం వెళ్ళినాక అడ్డంగా రహ దారి తగులుతుంది. కుడివైపు తిరిగి ముక్కు సూటిగా పోతే శ్రీపురం వస్తుంది," అన్నాడు చాకలి. భీమన్నకు సందేహం వచ్చింది. "ముక్కు సూటిగా అంటే ఎవరి ముక్కుకు సూటిగా? నా ముక్కుకా? ఎద్దుల ముక్కుకా?" అని అతను చాకలిని అడిగాడు.

భీమన్న వ్యవహారం చాకలికి అర్థమయింది. "నువ్వయితే అటూ ఇటూ తిరుగుతావు. ఎద్దులయితే ఎటూ తిరగకుండా ముక్కు సూటిగా పోతాయి," అన్నాడు వాడు భీమన్నతో.

ఈ మాటతో భీమన్నకు తృప్తి కలిగింది. అతను బండిలో చేరగిలబడి కూచుని ఎద్దులతో, "ముక్కు సూటిగా వెళ్ళండి," అని చెప్పాడు. ఆ తరవాత కొద్ది సేపటికే బండి ఊపుకు భీమన్నకు సుఖంగా నిద్రపట్టింది. ఎద్దులకు తోలేవాడి అజమాయిషీ లేకపోయేసరికి, అవి నిశ్చింతగా ఇంటి దారి పట్టాయి.

ఆ సాయంకాలం భీమన్న భార్య మహలక్ష్మి ఊరి దేవాలయానికి వెళుతూ తన భర్త వెళ్ళిన బండి ఎదురు వస్తూండటం గమనించింది. మొదట ఆమె తన భర్త పని పూర్తి చేసుకుని శ్రీపురం నుంచి తిరిగి వస్తున్నాడనుకుంది. కాని తీరా బండి సమీపానికి వచ్చాక బండి వెంట తోలేవాడు లేకపోవటమూ, బండిలో తన భర్త నిద్రపోతూండటమూ, పళ్ళూ, కొబ్బరికాయలూ, పూజాద్రవ్యాలూ బండిలోనే ఉంటమూ ఆమెకు కనిపించింది. ఆమె ఎద్దులను ఆపి, భర్తను తట్టి లేపి, "మీరు శ్రీపురం వెళ్ళ లేదా?" అని అడిగింది.



భీమన్న నిద్రలేస్తూనే, "శ్రీపురం వచ్చిందా?" అన్నాడు. తరవాత భార్యను చూసి ఆశ్చర్యపోయి, ఆమెతో జరిగినదంతా చెప్పాడు. అంతా విని మహలక్ష్మి భీమన్నతో, "అయిందేదో అయింది. ఇవాళకు మన ఊరి ఆలయంలోనే అర్చన జరిపింతాం. రేపు శ్రీపురానికి నేనుకూడా వస్తాను," అని చెప్పింది.

ఇద్దరూ కలిసి దేవాలయంలో అర్చన జరిపి ప్రసాదంతో ఇంటికి తిరిగి వచ్చారు. ఉదయమనగా మరొక గ్రామం వెళ్ళిన జమీందారు పొద్దుపోయి ఇంటికి వచ్చాడు. మహలక్ష్మి తన తండ్రికి ప్రసాదం ఇస్తూ,

"పొద్దున మన బండివాడు మధ్య దారిలో బండి ఆపి ఎటో వెళ్ళి ఎంతకీ రాకపోతే మీ అల్లుడుగారు తానే బండి తోలుకుని శ్రీపురం వెళ్ళి అర్చన చేయించి వచ్చారట. అక్కడ ఎంతో వైభవంగా ఉందట. రేపు నన్నుకూడా తన వెంట రమ్మంటున్నారు," అని చెప్పింది.

అంతలోనే బండివాడు కూడా వచ్చి చేతులు కట్టుకుని నిలబడ్డాడు. వాడు మాట్లాడక ముందే మహాలక్ష్మి వాడి మీద విరుచుకుపడి, "అయ్యగార్ని వదిలేసి మధ్య దారిలో అంతసేపు ఎక్కడి కెళ్ళావురా, పశువా? చూసి చూసి ఆయన వేళ మించి పోతుందని స్వయంగా బండి తోలుకెళ్ళారు, తెలుసా? ఇలాగేనా నువ్వు పని చేసేది?" అని వాణ్ణి గదమాయించింది.

"నేను అప్పుడే తిరిగొచ్చా నమ్మగారూ. బండి జాడే లేదు. అప్పుడు కాలి నడకన శ్రీపురం వెళ్ళా. అక్కడ బండిగాని, అయ్య గారు గాని కనిపించ లేదు," అన్నాడు బండివాడు.

"నువ్వు అప్పుడే తిరిగొచ్చి ఉంటే బండి ఎందుకు మాయమవుతుందీ? నువ్వు కాళ్ళీడ్చుకుంటూ శ్రీపురం చేరేసరికి అయ్య గారు అర్చన ముగించి తిరుగుదారి పట్టి ఉంటారు," అన్నది మహాలక్ష్మి.

"దారంతా చూశానమ్మగారూ—" అని బండివాడు అంటుంటే, మహాలక్ష్మి వాణ్ణి మాట్లాడ నివ్వక, "ఏడవలేక పోయావు. ఇవాళ అయిందేదో అయింది. రేపు మే మిద్దరమూ మళ్ళీ శ్రీపురం వెళుతున్నాం. పెందలాడే బండి సిద్ధం చేసి తీసుకురా!" అన్నది. తన కొక పెద్ద గండం తప్పినట్టుగా సంతోషించాడు, బండివాడు. మర్నాడు భీమన్న వెంట మహాలక్ష్మికూడా వెళ్ళి, శ్రీపురంలో అర్చన జయప్రదంగా చేయించింది. ఇద్దరూ సంతోషంగా ఇంటికి తిరిగి వచ్చారు. [పై మాసం మరొక సంఘటన]



# అభిప్రాయ భేదం

ఇద్దరు అన్నదమ్ములు ఊరి బయట ఉండగా ఆకాశంలో ఎగిరివస్తూ ఒక అడవి బాతు కనిపించింది. అన్న బాణం తీసి వింటికి సంధిస్తూ, "ఆ బాతును పడగొడతాను. ఇంటికి తీసుకుపోయి ఉడకబెట్టి తిందాం," అన్నాడు.

"వద్దు, వద్దు. వేపి తింటే ఇంకా బాగుంటుంది," అన్నాడు తమ్ముడు.

ఇద్దరూ కొంతసేపు వాదించుకున్నాక పెద్దవాళ్ళను అడిగి తెలుసుకుందామని ఊళ్ళోకి వెళ్ళారు. ముందు కొంచెం ఉడకబెట్టి తరవాత వేపటం ఉత్తమమని పెద్దలు చెప్పారు.

అన్నదమ్ములు తృప్తిపడి బాతును కొట్టటానికి మళ్ళీ ఊరి బయటికి వెళ్ళారు. కాని అప్పటికే అది ఎటో వెళ్ళిపోయింది.



## మానసిక భ్రమలు ★ [రామతీర్థ కథ]

ప్రపంచంలో గుడ్డివాళ్ళెక్కువా, కళ్ళు గల వాళ్ళెక్కువా అన్న విషయమై బీర్బల్‌కూ, అక్బరుకూ, వాదం జరిగింది. ఎవ రెక్కువయిందీ ప్రత్యక్షంగా చూపిస్తానన్నాడు బీర్బల్.

అతను ఒక బట్టను తలకు చుట్టుకుని సభకు వచ్చి తన పక్కన ఉన్న వాణ్ణి, "నా నెత్తిమీదిది ఏమిటి?" అని అడిగాడు. "తలపాగా," అని ఆ మనిషి జవాబు చెప్పాడు.

బీర్బల్ ఆ బట్టను విప్పి భుజాన వేసుకుని మరొకసభికుణ్ణి, "ఇదేమిటి?" అని అడిగాడు.

"ఉత్తరీయం," అని ఆ సభికుడు చెప్పాడు.

మరి కొంతసేపయాక బీర్బల్ అదే బట్టను కట్టుకుని సభలోకి వచ్చి ఇంకొక సభికుణ్ణి, "ఇదేమిటి?" అని అడిగాడు.

"ధోవతి," అని ఆ సభికుడు జవాబిచ్చాడు.

"గుడ్డివాళ్ళు! అంతా గుడ్డివాళ్ళు! ఇది బట్ట; దీన్ని ఒకడు తలపాగా అనీ, ఒకడు ఉత్తరీయమనీ, మరొకడు ధోవతీ అనీ భ్రమపడుతున్నారు!" అన్నాడు బీర్బల్.





# గంధర్వ చక్రవర్తి కూతురు

## 5

అబ్దల్ కద్దూస్ ఇచ్చిన నీలిగుర్రం ఎక్కి హసన్ పగ్గాలు వదిలేశాడు. అప్పు డా గుర్రం బాణంలాగా సూటిగానూ, అతి వేగంగానూ ప్రయాణిస్తూ పది రోజుల కాలంలో పది సంవత్సరాల నడక ముగించి ఒక నల్లని పర్వత పంక్తిని చేరుకున్నది. ఆ పర్వత పంక్తి తూర్పు పడమరలుగా వ్యాపించి ఉన్నది. నీలిగుర్రం గట్టిగా సకిలించి పర్వతాల మీద దిగగానే ఎక్కడి నుంచో నల్లని గుర్రాలు వేనకువేలుగా వచ్చి నీలిగుర్రాన్ని చుట్టుముట్టాయి. నీలిగుర్రం వాటి మధ్యగా వెళ్ళి ఒక నల్లని గుహను సమీపించింది. గుహ వెలుపల హసన్‌ను దించి అది గుహలోకి వెళ్ళిపోయింది.

గుహ వెలుపల హసన్ ఒక గంటసేపు కాచుకున్నాక ఒక గౌరవనీయుడైన వృద్ధుడు గుహ నుంచి వెలికి వచ్చాడు. అతను కారు నలుపుగా ఉండటమే గాక నల్లని దుస్తులు కూడా ధరించాడు. నడుము కిందికి వేళ్ళాడే ఆయన గడ్డం మటుకు తెల్లగా ఉన్నది. ఈయన సాక్షాత్తూ సులేమాన్ కొడుకైన అలీ. హసన్ ఆయన ముందు భక్తిగా మోకరించాడు. తరవాత ఆయనకు అబ్దల్ కద్దూస్ రాసిన ఉత్తరం అందించాడు. అలీ ఆ ఉత్తరాన్ని మౌనంగా తీసుకుని గుహలోకి వెళ్ళిపోయాడు.

ఎంతోసేపు గడిచింది. హసన్ నిరాశ చెందుతూండగా వృద్ధుడు తెల్ల దుస్తులు ధరించి గుహలో నుంచి వచ్చి, లోపలికి రమ్మని సైగ చేసి, తనతో బాటు అతన్ని గుహ లోపల ఉన్న ఒక సావడిలోకి తీసుకు వెళ్ళాడు. అది రత్నాలు పొదిగిన సావడి.

సి. మాధవరావు



దాని నాలుగు మూలలా తివాసీల పై నలుగురు జ్ఞానులు కూచుని ఉన్నారు. వారి పక్కన గ్రంథాలు దొంతరలు దొంతరలుగా పేర్చి ఉన్నాయి. సావడి మధ్య వృద్ధుడి శిష్యులు ఏడుగురున్నారు. వీరు ఏమేమో రాస్తున్నారు, చదువుతున్నారు.

అలీ రాగానే అందరూ లేచి, ఆయన సావడి మధ్య కూచోగానే అందరూ ఆయనను పరివేష్ఠించి కూచున్నారు. అప్పుడు హసన్ వారందరికీ తన కథ అంతా చెప్పాడు. తరవాత అందరూ చర్చించి హసన్‌కు సహాయం చెయ్యటమే ఉచితమని వృద్ధుడికి సలహా ఇచ్చారు. వారి సలహా విని ఆయన, "నిజమే కాని వాక్-వాక్ దీవులకు వెళ్ళటం తేలికకాదు. అక్కడి నుంచి తిరిగిరావటం మరింత కష్టం. యోధ కన్యల నుంచి అతనికి గల అపాయం మాట చెప్పనే అవసరంలేదు. ఈ కుర్రవాడు తన భార్యను ఎలా కలునుకోగలుగుతాడో నాకు అర్థం కావటంలేదు," అన్నాడు.

ఈ మాటలు విని హసన్ వృద్ధుడి కాళ్ళపై పడి తనకు భార్యాదానమూ, పుత్ర దానమూ చెయ్యమని ప్రార్థించాడు.

"చావటానికి నీలాగా ఆత్రపడేవాణ్ణి నే నెక్కడా చూడలేదు. నీవు తలపెట్టిన పని ఎంత ప్రమాదకరమైనదీ నీకు కొంచెం కూడా తెలియదు. అయినప్పటికీ నా చేతిలో ఉన్న సహాయమంతా నేను చేస్తాను," అంటూ వృద్ధుడు తన గడ్డం నుంచి కొన్ని వెంట్రుకలు పీకి హసన్ కిచ్చి, "అన్నిటి కన్న ముఖ్యం అపాయాల నుంచి బయట పడటం. నీకు ప్రాణం మీదికి వచ్చినప్పుడు ఈ వెంట్రుకలలో ఒకటి తీసి కాల్చినట్టయితే నేను తక్షణం వచ్చి నీకు సహాయం చేస్తాను," అన్నాడు.

తరవాత ఆయన తల ఎత్తి పైకి చూసి చప్పట్లు చరిచాడు. వెంటనే ఒక భూతం వారి ఎదట ప్రత్యక్షమయింది. వృద్ధుడు

హసన్‌తో, "వీడి వీపు మీద సవారీ అయి వెళ్ళు. వీడు నిన్ను కర్పూరద్వీపం మీద దించుతాడు. ఆ పైన నీ దారి నీవే చూసు కోవాలి. కర్పూరద్వీపం గడిచి అవతలి చివరకు వెళ్ళితే వాక్-వాక్ దీవులుండే సముద్రం యొక్క ఇవతలి తీరం చేరు కుంటావు. ఆ తరవాత భగవంతుడే ఉన్నాడు," అన్నాడు.

హసన్ వృద్ధుడికీ, మిగిలిన వారికీ నమస్కారాలు పెట్టి భూతం వీపు మీద ఎక్కి కూచున్నాడు. భూతం ఆకాశమార్గాన ప్రయాణించి అతన్ని కర్పూరద్వీపం మీద దించి తన దారిన తాను వెళ్ళిపోయింది. నిగనిగా మెరుస్తూ, సువాసన వెదజల్లే ఆ కర్పూరద్వీప మైదానం మీద పడి హసన్ నడవసాగాడు. కొంత దూరం వెళ్ళే సరికి అంత దూరాన అతని కొక గుడారు లాటిది కనబడింది. ఎత్తయిన గడ్డి మధ్యగా అతను ఆ గుడారం కేసి నడుస్తూ, కాలికి ఏదో తగిలి పడిపోయాడు.

హసన్‌కు తగిలినది ఒక మహాకాయుడి శరీరం. అతనికి గుడారంలాగా కనిపించి నది ఆ మహాకాయుడి చెవి. ఆ మహాకాయుడు గడ్డిలో పడుకుని నిద్రపోతూ, హసన్ తన పైన పడగానే పెద్ద పెడబొబ్బ



పెట్టి తాటిచెట్టు ప్రమాణాన లేచి నిలబడి, హసన్‌ను పిచ్చికను పట్టుకున్నట్టు పట్టుకుని పైకెత్తాడు.

హసన్ భయంతో గిలాగిలా కొట్టుకుంటూ, "రక్షించండి! కాపాడండి!" అని పెద్దగా కేకలుపెట్టాడు.

"ఈ పక్షి చిత్రంగా కూస్తుందే! దీన్ని మా రాజుగారికి బహుమానం ఇస్తాను," అనుకున్నాడు మహాకాయుడు.

కర్పూరద్వీపపు రాజు ఒక రాతి మీద కూచుని ఉన్నాడు. అయన కూడా హసన్‌ను చూసి ఏదో పిట్ట అనీ, "రక్షించండి! కాపాడండి!" అని అతను అరిచే అరుపులు

కూత అనీ అనుకుని చాలా ముచ్చటపడ్డాడు. అయన ఒక పంజరంలో హసన్‌ను పెట్టి అతనికి నీరూ, ఆహారమూ ఆ పంజరంలోనే ఏర్పాటు చేసి తన ఇంట వేళ్ళాడగట్టాడు.

రోజులు గడిచాయి. హసన్ పంజరంలో చిక్కి పాలిపోయి నీరసించసాగాడు. చివరకు అతనికి ప్రాణాపాయ స్థితి కూడా ఏర్పడింది. ఆ స్థితిలో అతనికి వృద్ధుడి వెంట్రుకలు జ్ఞాపకం వచ్చాయి. రాజు కూతురు అతన్ని ఆడించటానికి పంజరంలో నుంచి బయటికి తీసినప్పుడు అతను ఆమె పట్టు తప్పించుకుని వెళ్ళి వృద్ధుడి వెంట్రుక ఒకటి కాల్చాడు.

వెంటనే వృద్ధుడు ప్రత్యక్షమై, "ఏం కావాలి, హసన్?" అని అడిగాడు.

"నన్నిక్కడి నుంచి మరెక్కడికైనా చేర్చండి. ఇంకొక్క రోజు గడిస్తే నా ప్రాణాలు దక్కేలాగులేవు," అన్నాడు హసన్ దీనంగా.

"నేను చెప్పాను కానా? ఇంకా ఆపగింజలో అర భాగం కాలేదు. ఇక్కడ గనక నా వెంట్రుక కాల్చి నన్ను పిలవ గలిగావు. వాక్-వాక్ దీవులలో ఏ ఇతర మంత్రాలూ, తంత్రాలూ పారవు. అక్కడ నీకు భగవంతుడే దిక్కు. నీవీ ప్రయత్నం ఏనాడో మాని ఉండవలిసింది," అన్నాడు వృద్ధుడు.



"నా ప్రయత్నంలో చస్తే చస్తాను. దానికి నేను సిద్ధంగానే ఉన్నాను. చావు అన్నది రాసిపెట్టి ఉన్నప్పుడే వస్తుందిగాని ముందే వచ్చెయ్యదు గదా! నా భార్య కోసం వెళ్ళటం ఎలా మానుకుంటాను? దయచేసి నాకు ముందు దారి చెప్పండి," అన్నాడు హసన్.

వృద్ధుడు హసన్ చెయ్యి పట్టుకుని, "నీ కళ్ళు ఒక్కసారి మూసి తెరు," అన్నాడు. హసన్ కళ్ళు మూసి తెరిచే సరికి అతను ఒక సముద్రం ఒడ్డున ఉన్నాడు. వృద్ధుడి జాడలేదు. అతను నిలబడిన తీరాన అనేక రంగుల రత్నాలున్నాయి. అతను ఒక్కసారి చుట్టూ కలయ చూశాడో లేదో, సముద్రతీరాన ఉండే కొండల మీది నుంచి పెద్ద ఆకారం గల పక్షులు, "వాక్-వాక్" అని అరుస్తూ తూగిడీలు తూగిడీలుగా లేచాయి.

తానున్నది వాక్-వాక్ దీవులలో చేరినదే నని హసన్ గ్రహించాడు. ఈ పక్షులు తనను సముద్రంలోకి తోసేలోపునే ఎక్కడైనా దాక్కోవాలని చూసే సరికి అతనికి అదృష్ట వశాత్తూ దగ్గరలోనే ఒక గుడిసె కనిపించింది. అతను అందులోకి వెళ్ళి కూచున్నాడు. కాని అంతలోనే భూమి దద్దరిల్లింది. అంత దూరాన ధూళి లేచింది. ఆ ధూళి





మేఘం తానున్నవేపే వస్తున్నది. త్వరలోనే అతనికి ఆ మేఘంలో మెరుపుల్లాగా ఈటెల కొసలూ, శిరస్త్రాణాలూ, కవచాలూ కని పించాయి. ఆ వచ్చేది భయంకరులైన యోధకన్యలు!

వారు పెద్ద పెద్ద గుర్రా లెక్కి, కత్తులు ధరించి, వాయువేగంతో అతనున్న చోటికి వచ్చారు. వారి నుంచి హసన్ తప్పించుకు పోయేమార్గం లేదు. అతను గుడిసె వాకిట నిలబడ్డాడు. అతన్ని చూడగానే గుర్రాలన్నీ నిలిచిపోయాయి. యోధకన్యలలో ఒకతె తన గుర్రాన్ని హసన్ సమీపానికి నడి పించుకుంటూ వచ్చింది. ఆమె ముఖానికి



కూడా కవచం ఉండటంచేత దాన్ని అతను చూడలేకపోయాడు. ఆమె ఏమీ అనక ముందే అతను నేలపై ఆమె ముందు సాష్టాంగపడి, "దేవీ, నేను విధి వశాన ఈ దీవికి వచ్చాను. నీ శరణు జొచ్చాను. భార్యనూ, బిడ్డలనూ వెతుక్కుంటూ వచ్చిన ఈ నిర్భాగ్యుడిపై దయ తలిచి నాకు అభయం ఇయ్యి," అన్నాడు.

ఆమె తన గుర్రం మీది నుంచి దిగి, ఒక్క చేతి ఊపుతో తన అనుచరులను పంపేసి, అతని కేసి పరీక్షగా చూసి, తన ముఖానికి అడ్డంగా ఉన్న కవచ భాగాన్ని తొలగించింది. ఆమె ముఖం చూసి భయ పడి హసన్ కెవ్వున అరిచాడు. యోధ కన్యలు చాలా అందకత్తెలని ప్రతీతి. ఈమె ఎంతో ముసలిదేకాక అమిత అంద వికారం గానూ, భయంకరంగానూ ఉన్నది.

తనను చూసి హసన్ కళ్ళు మూసు కున్నది భయంతోనని తెలియక, తనపై గల గౌరవం కొద్దీ అనుకుని ముసలిది, "భయ పడకు, నాయనా! నిన్ను నేను రక్షిస్తాను. నీకు కావలిసిన సహాయమంతా చేస్తాను. కాని ముందు నిన్నెవరూ చూడకుండా చూడాలి. అందుచేత నీకు యోధకన్య దుస్తులు తెచ్చి యిస్తాను. వాటిని ధరించు.



అ తరవాత నీ కథ సావధానంగా వింటాను," అన్నది.

ఆమె వెళ్ళి త్వరలోనే యోధకన్యలు ధరించే కవచాలు మొదలైన వాటితోనూ, ఆయుధాలతోనూ తిరిగి వచ్చింది. అవన్నీ ధరిస్తే హసన్ కూడా యోధకన్యలాగే ఉన్నాడు. ముసలిది అతన్ని సముద్ర తీరాన ఉన్న ఒక రాతిపై కూచోబెట్టి, తాను కూడా కూచుని అతని కథ అంతా సమగ్రంగా విన్నది. విని అతని భార్య పేరూ, కుమాళ్ళ పేర్లూ అడిగింది. అతను వారి పేర్లు చెప్పి, "వాళ్ళ నిక్కడ ఏ పేర్లతో పిలుస్తారో నాకు తెలియదు," అన్నాడు.

ముసలిదానికి హసన్ పై మాతృప్రేమ పుట్టుకొచ్చింది. ఆమె అతనితో, "హసన్, తల్లి తన బిడ్డ కోసం చెయ్యదగినంతా నేను నీ కోసం చేస్తాను. నీ భార్య ఈ యోధ కన్యలలో ఒకతె అయి ఉంటుంది. రేపు స్నానాలకు ఇక్కడికి వచ్చినప్పుడు నీవు వారందరినీ చూసి వారిలో నీ భార్యను గుర్తు పట్టగలిగితే నీ పని తేలిక అవుతుంది," అన్నది.

ఆమె అన్నట్టే, మర్నాడు యోధకన్యలు సముద్రంలో స్నానం చెయ్యటానికి కవచాలూ, శిరస్త్రాణాలూ లేకుండా వచ్చినప్పుడు, మారువేషంలో ఉన్న హసన్ వారినందరినీ చూశాడు. కాని, వారిలో అతని భార్య లేదు.

అందరూ స్నానాలు చేసే సమయంలో హసన్ ముసలిదానికి ఈ మాట చెప్పగానే ఆమె కంగారు పడి, "అయ్యో, హసన్, ఇంక మిగిలినది మా చక్రవర్తిగారి ఏడుగురు కూతుళ్ళు మాత్రమే. వారిలో ఒకతె నీ భార్య అయిన పక్షంలో నీవూ నేనూ కూడా హతాశులమే. నువు వెతికేది నీ భార్యను కాదు, నాయనా, మృత్యువును! ఈ ప్రయత్నం ఇంక మాని నీ ఆశ నిరాశ చేసుకో!" అన్నది.

"అమ్మా, ఇంత దూరం వచ్చి ఇప్పుడు వెనక్కు మళ్ళనా? నీ సహాయం మీద ఎంతో ఆధారపడ్డాను. ఇప్పుడు నేను అప జయం శంకించానంటే అది నీ శక్తి సామ ర్థ్యాలను శంకించటమే గద! ఈ ఏడు దీవులూ నీ రక్షణలో ఉండగా నీకు అసాధ్య మంటూ ఉంటుందా?" అన్నాడు హసన్.

"నాకున్న అధికారం ఈ దీవులను కాపాడే యోధకన్యలపైన. వారిలో నీ యిష్టం వచ్చినదాన్ని కోరుకో, ఇచ్చేస్తాను. అమెను మీ నగరానికి తీసుకుపోయి సుఖంగా ఉండు. అలా కాదన్నావో మన యిద్దరికీ విపత్తు తప్పదు!" అన్నది ముసలిది.

హసన్ భోరున ఏడవసాగాడు. అతని దుఃఖం చూసి కలవరపడి అమె, "నన్నేం చెయ్యమంటావో చెప్పు. నిన్ను ఈ దీవి మీదికి రానిచ్చినందుకే నా పీక తెగిపోతుంది. పోనీ నీకు భార్య కాకపోతే అంతులేని ధనం ఇస్తాను పట్టుకు పో. దానితో బతికున్నంత కాలమూ చక్రవర్తిలాగా భోగాలు అనుభ వించు," అన్నది.

హసన్ అమె కాళ్ళు పట్టుకుని, "నా ప్రయత్నం ఫలించి తీరాలి. విధి నాకు అనుకూలంగా ఉండబట్టే ఇన్ని అప దలూ గడిచి ఇంతదాకా రాగలిగాను.




ఈ దశలో ఈ ప్రయత్నం విరమించటం కన్న చావే ఎన్నో రెట్లు మేలు," అన్నాడు.

హసన్ పట్టు మంకుపట్టని ముసలిది గ్రహించింది. "అయేదేదో అవుతుంది. నీతోపాటు అవసరమైతే నేనూ నాశనమై పోతాను. అంతకన్న గత్యంతరం లేదు. వాక్-వాక్ దీవులు ఏడూ, చక్రవర్తి కుమా ర్తెలు ఏడుగురి అధీనంలోనూ ఉన్నాయి. ఇది పెద్ద కుమార్తె దీవి. అమె పేరు నూరల్‌హుదా. నీ సంగతంతా అమెకు చెప్పి ఎలాగైనా ఆమెను నీ పట్ల సుముఖు రాలిని చేసి ఇప్పుడే వస్తాను," అని ముస లిది వెళ్ళిపోయింది.

నూరల్‌హుదా ముసలిదాన్ని చూస్తూనే మర్యాదగా లేచి, ఆమెకు ఆసనం చూపించి కూచోమని, "ఏమైనా మంచి వార్త తెచ్చావా? లేక ఏదైనా కోరటానికి వచ్చావా? అడుగు, ఇచ్చేస్తాను," అన్నది.

"మహారాణీ, నా చిట్టి తల్లీ! ఇవాళ ఒక వింత జరిగింది. అది వింటే నువు పగలబడి నవ్వుతావు. ఒక యువకుడు ఎలా వచ్చాడో మన తీరాన వచ్చిపడ్డాడు. అతను ఏడుస్తూ నా కంటపడే సరికి అతని విషయం అడిగాను. విధి తనను ఇక్కడికి ఈడ్చుకు వచ్చిందనీ, తాను తన భార్యను వెతుకుతున్నాననీ చెప్పాడు. అతను, తన భార్యను వర్ణించాడు. ఆవర్ణన చూస్తే నీవో, నీ చెల్లెళ్ళలో ఒకరో అయి ఉండా లనిపించింది. అతను కూడా, మానవుడే అయినప్పటికీ, అసాధారణ సౌందర్యవంతుడు," అన్నది ముసలిది.

నూరల్‌హుదా చప్పున మండిపడి, "ముసలిపీనుగా, పాపిష్ఠిదానా! మన ద్వీపం మీదికి మగవాణ్ణి ఎలా రానిచ్చావు? నీ రక్తం తాగి, నీ కండలు పీక్కుతింటాను! నీ పీక నులిమేసే ముందు ఆ మనిషిని ఒకసారి చూస్తాను, వాణ్ణి పట్టుకు రా! వాడు మన దీవిపై అడుగు పెట్టి దాన్ని అపవిత్రం చేశాడు," అన్నది.



"ఈ అబ్బి నా ప్రాణం మీదికి తెచ్చాడు," అని ముసలిది గొణుగుతూ, భయంతో తత్తరపడిపోతూ హసన్ వద్దకు వెళ్ళి, "జీవచ్ఛవమూ, బయలుదేరి రా! నిన్ను మా రాణీగారు చూస్తారట!" అన్నది. "నాకేం మూడనున్నది?" అనుకుంటూ హసన్ ఆమె వెంట బయలుదేరాడు.

వారు వచ్చేసరికి నూరల్‌హుదా మేలి ముసుగు ధరించి ఉన్నది. హసన్ ఆమెకు ప్రణామాలు చేసి, ఆమె పైన పద్యాలు కూడా చదివాడు. చక్రవర్తి కూతురు అంతా విని, ప్రశ్నించమన్నట్టుగా ముసలిదానికి సైగ చేసింది. ముసలిది హసన్ కేసి తిరిగి, "మహారాణీవారు అడుగుతున్నారు. నీ పేరూ, నీ భార్య పేరూ, నీ పిల్లల పేర్లూ చెప్పు," అన్నది.

హసన్ చక్రవర్తి కూతురి కేసి తిరిగి, "మహారాణీ, నేను హసన్ అనే దౌర్భాగ్యుణ్ణి. నాది ఇరాక్ దేశంలో బస్రా నగరం. నా భార్య పేరు నాకు తెలియదు. నా కొడుకులకు నాసిర్, మన్సూర్ అని పేర్లు పెట్టుకున్నాం," అన్నాడు.

నీ భార్య నిన్ను ఎందుకు వదిలిపోయిందని అడిగితే హసన్ తనకు తెలియదన్నాడు; కాని ఆమె మనస్ఫూర్తిగా తనను వదిలి ఉండదన్నాడు. ఆమె బయలుదేరింది



బగ్దాదులోని ఖలీఫా భవనం నుంచి అనీ, ఎగిరిపోవటానికిగాను ఆమె పక్షి ఉడుపు ఉపయోగించిందనీ, వెళ్ళిపోయేటప్పు డామె తన తల్లితో తాను వాక్-వాక్ దీవులలో ఉంటానని చెప్పిందనీ కూడా హసన్ చక్రవర్తి పెద్ద కుమార్తెకు చెప్పేశాడు.

అంతదాకా మౌనంగా ఉన్న నూరల్‌హుదా, "నీ భార్యకు నీపై ప్రేమ లేకపోతే తానుండే చోటు చెప్పి ఉండదు; నీపైన ప్రేమ ఉంటే నిన్ను విడిచి వెళ్ళిపోయి ఉండదు," అన్నది.

తన భార్య తనను గాఢంగా ప్రేమించినట్టు లక్ష నిదర్శనాలున్నాయనీ, ఎగరాలన్న కోరికచేత వివశురాలై ఆమె వెళ్ళిపోయిందనీ హసన్ ప్రమాణంచేసి చెప్పాడు. అంతా చెప్పి అతను, తన భార్య తనకు లభించేటందుకు సహాయం చెయ్యమనీ, వాక్-వాక్ దీవులకు వచ్చిన తన సాహసాన్ని క్షమించమనీ అతను ఆమెతో అన్నాడు.

ముసలిది కూడా ధైర్యం తెచ్చుకుని చక్రవర్తి కూతురి కాళ్ళపై పడి, "మహారాణీ, నిన్ను పెంచి పెద్దదాన్ని చేసిన నా మొర ఆలకించు. ఈ అభాగ్యుణ్ణి శిక్షించకు. ఇతను ఇన్ని కష్టాలూ గడిచి దేవుడి దయచేతనే ఇక్కడికి చేరాడు. మనం ఇతన్ని అతిథిగా చూడటం భావ్యం. ఇతను చేసిన తప్పులు భార్యపై గల ప్రేమతో చేసినవి; వాటిని క్షమించవచ్చు. అదంతా అలా ఉంచి ఇతను చక్కని ఆశుకవిత్వం చెబుతాడు. ఒకసారి మేలిముసుగు తొలగించి నీ ముఖం చూపించావంటే అద్భుతమైన పద్యాలు అల్లుతాడు," అన్నది.

హసన్ ఎలాటి కవిత్వం చెబుతాడోనని నూరల్‌హుదా కుతూహలపడి తన ముఖానికి అడ్డంగా ఉన్న మేలిముసుగు తొలగించింది. హసన్ ఆమె ముఖం కేసి చూస్తూనే కెవ్వున కేకపెట్టి మూర్ఛపోయాడు.

—(ముగింపు పై మాసంలో)






# కొండెగాడూ-కొబ్బరికాయా

ఎదురింటి వాళ్ళ కుర్రాడు చాడీలు చెప్పి, వీధిలో ఉండే పిల్లల్నందర్నీ పెద్దవాళ్ళ చేత తన్నించటం ప్రారంభించాడు. వాడి సంగతి తెలియగానే తాతయ్యకు చాలా కోపం వచ్చింది.

"పిల్లలు ఏం చేసినా సహిస్తాను గాని తంపులు పెట్టారంటే మాత్రం సహించను. మీ రలాటి వెధవ పన్లు చెయ్యకండేం?" అని తాతయ్య పిల్లల్ని హెచ్చరించాడు. తాతయ్యకు అంత కోపం రావటం పిల్లలు ఎన్నడూ చూడలేదు.

"నీకూడా ఇంత కోపం వచ్చిందే, తాతయ్యా?" అన్నారు వాళ్ళు.

"రాదురా మరీ? పుర్రెని పుట్టిన బుద్ధి పుడకల్తో గాని పోదంటారే, తంపులమారి తనం చచ్చినా కూడా పోదు. మీకు లోగడ కొబ్బరికాయ కథ చెప్పాను గాదూ?" అన్నాడు తాతయ్య.

"చెప్పలేదు, తాతయ్యా!... అసలు నువు చెప్పే కథల్లో కొబ్బరికాయ మాటే లేదు, తాతయ్యా!" అని పిల్లలు గోల చేశారు. తంపులమారి తనానికీ, కొబ్బరి కాయకీ సంబంధ మేమిటో వాళ్ళకి తెలీదు. కథ వినే ఆసక్తిలో వాళ్ళు ఆ విషయం ఆలోచించను కూడా లేదు.

తాతయ్య కోపమంతా తీసేసినట్టు పోయింది. ఆయన పొడుంకాయ తీసి, చిటికెడు పొడుం ఎడమ చేతిలో వేసుకుంటూ చిరునవ్వు నవ్వి, "అయితే కొబ్బరికాయ కథ నేను చెప్పనే లేదూ? అయితే ఇప్పుడు చెబుతాను వినండి," అంటూ పొడుంపట్టు పీల్చి ఇలా ప్రారంభించాడు:

చాలా వందల ఏళ్ళక్రితం బర్మా దేశం లోని సముద్రతీరానికి ఒక తెప్ప కొట్టుకు వచ్చిందట. దానిమీద ఇద్దరు మగవాళ్ళూ, ఒక ఆడదీ ఉన్నారు. వాళ్ళను అక్కడి



వాళ్ళు రాజుగారి దగ్గిరికి తీసుకుపోయారు. రాజుగారు వాళ్ళను చూసి, "మీ రేవరు? మీది ఏ దేశం? ఎందు కిలా తెప్పపైన తేలి వచ్చారు?" అని అడిగాడు. అడిగితే, తాము నేరస్థులమనీ, తమది సముద్రం అవతలి ఒడ్డున గల దేశమనీ, తమ రాజు గారు తమ నేరాలకు శిక్షగా ఇలా తెప్పమీద ఎక్కించి సముద్రం మీద వదిలేశారనీ వాళ్ళు చెప్పారు.

వాళ్ళు చేసిన నేరా లేమిటీ అంటే, ఒకడు దొంగ. ఆడది మంత్రాలూ మాకులూ నేర్చినది. రెండో మగవాడు తంపులు పెట్టి తలలు మార్చినవాడు.



అందరి నేరాలూ తెలుసుకున్న మీదట బర్మా దేశపు రాజు ఏం చేశాడూ, దొంగకి ఒక ఇల్లూ, వెయ్యి వెండి కాసులూ ఇచ్చి, "నీవు పేదరికంతో బాధ పడలేక దొంగ తనాలు చేశావు. అందుచేత నీకు పేదరికం లేకుండా డబ్బిస్తున్నాను. సుఖంగా జీవిస్తూ బుద్ధిగా ఉండు," అన్నాడు.

రాజుగారు మంత్రగత్తెకు కూడా అలాగే ఇల్లూ, డబ్బూ ఇచ్చి, "నీకు కూడా దారిద్ర్యమూ, కష్టాలూ ఉండటం చేతనే ఇతరులను చూసి ఓర్చలేక మంత్రాలు పెట్టి అందరినీ పీడించుకు తిన్నావు. ఇక నుంచీ నీకు ఏ లోటూ ఉండదు గనక బుద్ధిగా ఉండు," అన్నాడు.

తరవాత రాజుగారు కొండెగాణ్ణి చూసి, "వీడికి కొండాలు చెప్పి తంపులు పెట్ట టమే ఆనందం గనక ఎన్ని సౌకర్యాలు కలిగించినా వీడి కీ జాడ్యం పోదు. అందు చేత వీణ్ణి వెంటనే తీసుకుపోయి శిరచ్ఛేదం చెయ్యండి!" అని ఉత్తరు విచ్చాడు. రాజ భటులు వాణ్ణి ప్రేతభూమికి తీసుకు పోయి తల నరికేశారు.

అయిందా, మర్నా డుదయం రాజోద్యోగి ఒకడు అటుగా వస్తూ కొండెగాడి తలను చూసి నిర్ఘాంతపోయాడు. దేనికి? అది



నేలమీద అటూ ఇటూ దొర్లుతున్నది. రాజోద్యోగిని చూసి అది నోరు తెరిచి, "నువు వెళ్ళి మీ రాజును పిలుచుకు రా! వచ్చి నాకు సాష్టాంగ పడకపోయాడో, కంఠం నరికేస్తానని చెప్పు!" అన్నది.

రాజోద్యోగి కంగారు పడుతూ రాజభవనానికి వెళ్ళి తాను కన్నదీ, విన్నదీ రాజుగారికి నివేదించుకున్నాడు. రాజుగారు అతడి మాటలు నమ్మలేదు. ఎలా నమ్ముతాడూ? పైపెచ్చు ఆయనకు ఉద్యోగి పైన కోపం కూడా వచ్చింది.

రాజోద్యోగి రాజుగారి ఆగ్రహానికి వెరిచి, "నా మాట నమ్మకపోతే నావెంట మరొకర్ని పంపండి, మహారాజా! నేను చెప్పింది నిజమని సాక్ష్యం ఉంటుంది," అన్నాడు.

సరే, అలాగేనని రాజుగారు ఆ ఉద్యోగి వెంట మరొక ఉద్యోగిని కూడా పంపాడు. ఇద్దరూ కలిసి కొండెగాడి తల పడి ఉన్న చోటికి వెళ్ళారు. అది కదలలేదు, మెదలలేదు.

సాక్ష్యం వెళ్ళిన ఉద్యోగి రాజుగారి వద్దకు తిరిగి వచ్చి, "ఆ తలలో ప్రాణమే లేదు, మహారాజా!" అన్నాడు.

"నరికేసిన తలలో ప్రాణం ఎలా ఉంటుందీ? ఈ దుర్మార్గుడు నన్ను అవమానించే ఉద్దేశంతో ఆ తల నెపంగా పెట్టు



కుని నన్ను నానా మాటలూ అన్నాడు. వీడి తలకూడా తీసెయ్యండి," అన్నాడు రాజు. ఇకనేం మొదటి రాజోద్యోగిని కూడా ప్రేతభూమికి తీసుకుపోయి శిరచ్ఛేదం చేసే శారు. వెంటనే తంపులమారి వాడి తల గట్టిగా నవ్వి, "హ హ! తల తీసేస్తే నేను తంపులు పెట్టలే ననుకున్నారేం?" అన్నది.

రాజోద్యోగికి నిష్కారణంగా మరణశిక్ష పడిపోయింది. తంపులమారి వాడు చచ్చి కూడా తన నైజం మానలేదు. జరిగిన దానికి రాజుగారు చాలా నొచ్చుకుని, "ఈ కొండెగాడి తలను ఇలా ఉండనివ్వటం క్షేమం కాదు. దీన్ని వెంటనే ఎక్కడైనా పాతెయ్యండి," అన్నాడు.

కొండెగాడి తలను పాతేశారు. మర్నాటికి అక్కడ ఒక వింత చెట్టు పుట్టింది. అదే కొబ్బరిచెట్టు. అంతవరకూ బర్మావాళ్ళు కొబ్బరిచెట్టు ఎరగరు. అందుచేత వారు ఆ చెట్టుకు గోన్‌బిన్ అని పేరు పెట్టుకున్నారు. గోన్‌బిన్ అంటే కొండెగాడి చెట్టు అని అర్థం. ఇప్పుడా మాట అపభ్రంశమై ఓన్‌బిన్ అయిందనుకోండి.

తాతయ్య ఈ కథ చెప్పి, "మనం కొబ్బరికాయ పగలగొట్టేదాకా దాని పిలక ఊడదియ్యం, దేని కనుకుంటున్నారు? ఆ పిలకచాటున రెండు కళ్ళూ, ఒక చిన్న నోరూ ఉంటాయి. కాయ కాయగా ఉండగానే ఆ పిలక ఊడదీశామో, అది మనలో మనకు తంపులు పెట్టవచ్చు. అందుకే కొబ్బరికాయ కొట్టిందాకా దాని పిలక ఊడదీయరాదు," అన్నాడు.

"అందుక్కాదు, తాతయ్యా. పిలక ఉంటే కొబ్బరికాయ కొట్టటానికి వీలని, ఊడదియ్యం," అన్నాడు బుల్లివాడు.

"ఏడిచావు, వెధవా! నాకన్న నీ కెక్కువ తెలుసురా?" అంటూ తాతయ్య బుల్లివాణ్ణి కొట్టబోయినట్టు నటించాడు. బుల్లివాడు పెద్దగా నవ్వుతూ పారిపోయాడు.





# కిష్కింధా కాండ

జరిగిన దానికి చింతిస్తూ రాముడు, "సుగ్రీవుడా, నా మీద ఆగ్రహించకు. మీ రిద్దరూ ఒక్కటిగానే ఉన్నారు. మీ కంఠ స్వరాలు కూడా ఒకటిగానే ఉన్నాయి. ఎవరు ఎవరో తెలియక నేను బాణం వెయ్యలేదు. నా అజ్ఞానం చేత నీకు అపాయం కలిగింది. మన్నించు. నీవు ఏదైనా గుర్తు ధరించి మళ్ళీ వాలితో యుద్ధం చేసినట్టయితే ఒక్క బాణంతో అతన్ని పడగొట్టుతాను, నా మాట నమ్ము," అన్నాడు.

కొండచరియ పైన గజపుష్పి అనే లత పూలతో సహా పెరుగుతున్నది. లక్ష్మణుడు దాన్ని పెరికి తెచ్చి సుగ్రీవుడి మెడకు చుట్టాడు. అందరూ మరొకసారి కిష్కింధకు బయలుదేరి వెళ్ళారు.

గజపుష్పి మెడకు చుట్టుకున్న సుగ్రీవుడి వెంట నళుడూ, నీలుడూ, తారుడూ కూడా ఉన్నారు. కిష్కింధకు వెళ్ళే దారిలో రాముడికి చెట్లతో దట్టంగా ఉన్న ఒక వనం కనిపించింది. రాముడు దాన్ని గురించి సుగ్రీవుడి ద్వారా తెలుసుకున్నాడు. అది ఒక ఋష్యాశ్రమం. సప్త జనులనే పేరు గల ఏడుగురు ఋషులు ఆ ఆశ్రమంలో తీవ్రమైన తపస్సు చేశారు; నీటిలో తల కిందులుగా నిలబడి, వాయుభక్షణ చేస్తూ తపస్సు చేసి, శరీరాలతో స్వర్గానికి వెళ్ళిపోయారు. ఆ ఆశ్రమంలోకి మనుషులు కారు గదా, పశుపక్ష్యాదులు కూడా ప్రవేశించ లేవు; తెలియక లోపలికి వెళితే తిరిగి బయటికి రావటమంటూ ఉండదు.



రామలక్ష్మణు లిద్దరూ సప్తజన మహర్షులను తలుచుకుని ఆ ఆశ్రమానికి సమస్కరించి ముందుకు పోయారు. చాలాదూరం వెళ్ళాక వారు కిష్కింధ చేరుకున్నారు. సుగ్రీవుడు రాముడితో, "వాలిని చంపుతానని మాట ఇచ్చావు. ఆ పని శీఘ్రంగా చెయ్యాలి," అన్నాడు.

"ఈసారి వాలిని ఒక్క బాణంతో నిశ్చయంగా పడగొట్టుతాను. ఒకే రూపు గల మీ ఇద్దరిలో తారతమ్యం తెలియటానికి ఈసారి నీ మెడలో గజ పుష్పిలత ఉన్నది కద. అందుచేత నీ కేమీ జంకు వద్దు. వాలిని యుద్ధానికి పిలు," అని రాముడు చెప్పాడు. చుట్టూ ఉండే దట్టమైన అరణ్యంలో అందరూ దాగారు.

సుగ్రీవుడు ఆ అరణ్యాన్ని ఒక్కసారి కలయ జూసి భయంకరంగా గర్జించి వాలిని యుద్ధానికి పిలిచాడు.

ఈ గర్జన వింటూనే వాలికి పట్టరాని ఆగ్రహావేశం వచ్చేసింది. అతను యుద్ధానికి బయలుదేరాడు. ఇది చూసి తార చప్పున లేచి వాలిని పట్టుకుని, ఇలా అన్నది :

"ఈ రాత్రివేళ నీవు వెళ్ళి సుగ్రీవుడితో యుద్ధం చెయ్యవద్దు. కావలిస్తే రేపు ఉదయం వెళుదువుగాని. ఈలోపుగా నీ బలం తరిగి పోదు, సుగ్రీవుడి బలం హెచ్చి పోదు. ఇంతలో వచ్చిన తొందర ఏమిటి? కొంచెం ఆలోచించు! నేను అకారణంగా నిన్ను అడ్డగించటం లేదు. ఒకసారి నీ చేత చావు దెబ్బలు తిని దిక్కు తెలియకుండా పారిపోయిన సుగ్రీవుడు ఇప్పుడు ఏ ధైర్యంతో నిన్ను యుద్ధానికి పిలుస్తున్నాడు? ఎవరి అండో చూసుకునే అతను నిన్ను కవ్విస్తున్నాడు. వారెవరో కూడా నాకు తెలుసు. అయోధ్య రాజైన దశరథుడి కొడుకులు రామ లక్ష్మణులు సుగ్రీవుడుండే ఋశ్యమూకానికి వచ్చి అతనితో సఖ్యం చేశారట. వారు ఇదివరకే విరాధుణ్ణీ, ఖర దూషణు

లనూ, కబంధుణ్ణీ చంపారట. చాలా పరాక్రమవంతులు. వారిని గురించి మన అంగదుడికి చారులు చెప్పారు. సుగ్రీవుడు చాలా గడుసువాడు. ఒకంతట ఇతరులను నమ్మడు. రాముడి అండ చూసుకునే అతను ఇప్పుడు వచ్చాడు; అందుకేమీ సందేహం లేదు. నీ మేలుకోరి ఇంకొక మాటకూడా చెబుతాను. ఇప్పుడు సుగ్రీవుడు నీ కన్న బలవంతుడని తెలుసుకో. అతన్ని పిలిచి యువరాజుగా అభిషేకించు. నీ తమ్ముడే కదా, కిష్కింధలోనే ఉండనీ. నీకు రాముడి స్నేహం కూడా కలిసి వస్తుంది. సుగ్రీవుడితో యుద్ధమంటే రాముడితో యుద్ధమే. రాముడితో యుద్ధం నీకు క్షేమకరం కాదు."



తార చెప్పిన ఈ మాటలు వాలికి కొంచెంకూడా రుచించలేదు. అతను ఆమెతో, "తారా, నీవు నా మేలుకోరే ఈ మాట లన్నావు, కాని పిరికి దానివైన నీ మాటలు విని సుగ్రీవుడి ధూర్తత్వాన్ని సహిస్తానా? మహామహా వాళ్ళకే నేను భయపడలేదు, సుగ్రీవుడికి భయపడతానా? రాముడు నన్నెందుకు చంపుతాడు? అతనికి నేనేమీ ద్రోహం చెయ్యలేదుగద. సుగ్రీవుణ్ణి నేను చూస్తూ చూస్తూ చంపుతానా? శరీరమంతా నజ్జుగా కొట్టి బుద్ధి చెప్పి పంపేసి మళ్ళీ వస్తాను. నీవూ, మిగిలిన స్త్రీలూ నా వెంట పడి రాకండి; వెనక్కు వెళ్ళిపొండి," అన్నాడు.

స్త్రీలు వెళ్ళిపోయారు. వారు భయపడతారని అంతదాకా తన ఆగ్రహాన్ని అణచుకుని ఉన్న వాలి భయంకరాకారం ధరించి, కిష్కింధా నగరద్వారం దాటి వచ్చి, నడుము బిగించి తనకోసం ఎదురు చూస్తున్న సుగ్రీవుణ్ణి చూశాడు. వెంటనే తానుకూడా నడుము బిగించి, "నీ ప్రాణాలు తీస్తాను," అంటూ వాలి సుగ్రీవుణ్ణి తన పిడికిలితో కొట్టాడు. ఇద్దరూ చెట్లు పీకి, వాటితో ఒకరి నొకరు చావగొట్టుకున్నారు. వాలి అలిసి

పోయాడు గాని సుగ్రీవుడు మరింత హెచ్చు అలిశాడు, భయంతో నలు దిక్కులు చూడసాగాడు.

సుగ్రీవుడి క్షీణస్థితి గమనించి రాముడు కాలసర్పంలాటి బాణాన్ని ఏరి, ఎక్కు పెట్టి చెవిదాకా లాగి, వాలి ఎదురు రొమ్ముకు గురి చేసి విడిచాడు. వాలి దాని దెబ్బకు కింద పడిపోయాడు. అనేక సువర్ణాభరణాలూ, ఇంద్రుడిచ్చిన కాంచనమాలికా ధరించి నేలపై పడి ఉన్న వాలి వద్దకు రామలక్ష్మణులు వెళ్ళారు.



వాలి మెల్లిగా కళ్ళు తెరిచి రామలక్ష్మణులను చూసి రాముడితో, "నీవు మహారాజు కొడుకువు, గొప్ప వంశంలో పుట్టిన వాడవు, ధర్మాచరణ చేసే వాడివి, నేను మరొకరితో యుద్ధం చేస్తూండగా నన్ను బాణం వేసి కొట్టటం నీకేమంత ఖ్యాతికరం? తార నన్ను యుద్ధానికి వెళ్ళ వద్దని చెబితే నీ వంశాన్నీ, గుణాలనూ నమ్మి, నన్నేమీ చేయవనుకుని వచ్చాను. నేను నీ దేశానికి రాలేదు. నీకేమీ అపకారం చెయ్యలేదు. నిన్ను యుద్ధానికి పిలవలేదు. వానర మాత్రుణ్ణి, అందులోనూ మరొకరితో పోరుతున్నవాణ్ణి. నన్ను నీ వెందుకు హత్య చేస్తున్నావు? నీవు దుర్బుద్ధివి. విల్లు పట్టుకు తిరిగే హంతకుడివి. నీకు ధర్మమన్నది లేదు. నన్ను జంతువులాగా వేటాడావనుకుందామన్నా నా చర్మం ధరించటానికి పనికిరాదు. నా రోమాలూ, ఎముకలూ ఉపయోగపడవు. నా మాంసం తినటానికి పనికిరాదు. నీవు నిజంగా పరాక్రమం కలవాడవయితే రావణుడు మొదలైన వారిని చంపరాదా? నా ఎదటికి వచ్చి యుద్ధం చేస్తే ఈపాటికి యముడి వద్ద ఉండేవాడవు. సీతను వెతకమని నన్నే కోరి ఉంటే ఒక్క రోజులో నీ భార్యను తెచ్చి నీకిచ్చి ఉందును. అందుకేగదా నీవు సుగ్రీవుడికి ఉపకారం చెయ్యబోయి నన్ను చంపావు?" అన్నాడు.





మరణమే శిక్ష. నిన్ను శిక్షించక వదిలితే నేను ధర్మం తప్పిన వాణ్ణవుతాను. అదీ గాక నేను సుగ్రీవుడితో చేసిన మైత్రి లక్ష్మణుడికీ నాకూ గల బాంధవ్యంలాటిది. నేను భార్య నిమిత్తమూ, అతను రాజ్యం నిమిత్తమూ ఈ సఖ్యం చేసుకున్నాము. నిన్ను చంపుతానని వానరుల ముందు నేను ప్రతిజ్ఞ చేశాను. నేను చేసిన ప్రతిజ్ఞ తప్పటానికి వీలులేదు. అందుచేత నిన్ను వధించటంలో నేను అధర్మం అణుమాత్రం కూడా చెయ్యలేదు. నీవు కొన్ని మానవ ధర్మాలు అచరించటం చేత పై విధంగా చెప్పాను. కోతివిగా చూస్తే నిన్ను నేను ఏ సమయంలోనైనా వేటాడ వచ్చు. అభక్ష్య మృగాలను కూడా వేటాడుతారు. అవి ఏ మరుపాటున ఉన్నవా, పారి పోతున్నవా, నిర్భయంగా ఉన్నవా అని చూడరు. కోతివైన నిన్ను నేను నాతో యుద్ధం చేస్తేనే చంపాలన్న నియమం ఎక్కడా లేదు."

వాలి చేసిన ఈ అక్షేపణకు రాముడీ విధంగా జవాబు చెప్పాడు: "నీకు ధర్మార్థ కామాలకు సంబంధించిన ఆచారాలు తెలియవు. సమస్త భూమండలానికీ ఇక్ష్వా కులు రాజులు. భూమండలంలో అధర్మాన్ని శిక్షించే బాధ్యత ఇక్ష్వాకు రాజులది. ప్రస్తుతం భూమి కంతకూ భరతుడు రాజు. నా బోటి క్షత్రియులం అతని అజ్ఞకు బద్ధులమై అధర్మాన్ని శిక్షిస్తున్నాము. వానరుడవు కావటంచేతనూ, వానరుల సాంగత్యం కలిగి ఉంటటం చేతనూ నీకు ధర్మ సూక్ష్మాలు తెలియవు. నీవు నీ తమ్ముడి భార్యను పరిగ్రహించావు. ఇది మహా పాపం. అందుకు

రాముడు చెప్పినదంతా విని వాలి తాను రాముణ్ణి నిందించి నందుకు పశ్చాత్తాప పడ్డాడు. అతను రాముడితో, "నాకు చచ్చి పోతున్నానని దిగులు లేదు. నీ చేతిలో చావాలనే తార వద్దన్నా వినకుండా సుగ్రీవు

డితో ద్వంద్వ యుద్ధానికి వచ్చాను. నాకు అంగదుడు ఒక్కడే కొడుకు. వాణ్ణి గురించే నాకు దిగులు. వాణ్ణి సుగ్రీవుడు సరిగా చూసేలాగు చూడు. సుగ్రీవుడికి నా భార్య అయిన తారపై కక్ష ఉండవచ్చు. అతను ఆమెను అవమానించకుండా చూడు," అన్నాడు. అతనికి స్పృహ తప్పింది.

రాముడి బాణంతో వాలి దెబ్బ తిన్న వార్త తారకు తెలిసింది. ఆమె దుర్భరమైన దుఃఖంతో తన కొడుకుతో సహా కిష్కింధ నుంచి వచ్చింది. రాముడి చేత దెబ్బ తిన్న వాలిని చూసి భయపడి కొందరు వాలి అనుచరులు పారిపోయి వస్తూ, తారకు ఎదురయారు. వారు తారతో, "అమ్మా, నీ కొడుకింకా బతికి ఉన్నాడు. వాణ్ణి కాపాడు కోవటానికి తిరిగి వెళ్ళిపో. మృత్యువు రాముడి రూపంలో వచ్చి వాలిని తీసుకు పోతున్నది. అంగదుడికి పట్టాభిషేకం చెయ్యాలి. కిష్కింధ ద్వారం మూసి జాగ్రత్తగా రక్షించాలి. అలా చేయని పక్షంలో నీవు కిష్కింధను శత్రువులకు విడిచి పారిపో," అన్నారు.

"అంతటి భర్తే పోతుంటే ఇక నాకీ రాజ్యమూ, ఈ కొడుకూ, ఈ శరీరమూ పట్టుతాయా? నేను నా భర్త పాదాల



దగ్గిరికే పోతాను," అని వలవలా ఏడుస్తూ తార వాలి పడి ఉన్న చోటికి వెళ్ళింది. ఆమె రామలక్ష్మణులనూ, సుగ్రీవుణ్ణీ దాటి వెళ్ళి వాలిని చేరుకుని, అతనికి స్పృహ లేకపోవటం చూసి ప్రాణం పోయిందనుకుని మూర్ఛపోయింది. తరవాత స్పృహ నుంచి తేరుకుని భర్తను కౌగలించుకుని పెద్ద పెట్టున ఏడవసాగింది.

వాలి సమీపంలోనే నిలబడి ఉన్న హనుమంతుడు తారను ఓదార్చ యత్నించాడు. అంతలో వాలి కళ్ళు తెరిచి ఎదురుగా ఉన్న సుగ్రీవుణ్ణి చూసి, "సుగ్రీవా, మనం అన్న దమ్ములుగా సఖ్యం కలిగి, రాజ్య భోగాలను

కలిసి అనుభవించటానికి నోచుకోలేదు. అందుచేతనే నిన్ను వెళ్ళగొట్టాను. నీ భార్యను అపహరించానని నాపై కోపం ఉంచుకోకు. నా కొడుకు అంగదుణ్ణి నీకు అప్పగిస్తున్నాను. వాణ్ణి నేను చూసినట్టుగానే చూడు, నేను లేని లోటు రానియ్యకు. ఇక వానర రాజ్యం నీవే ఏలుకో. నా ప్రాణాలు పోయేలోపుగా ఈ కాంచనమాలికను తీసుకో," అన్నాడు. తరవాత అతను అంగదుడితో, "నాయనా, ఇక నుంచీ నీవు మీ పినతండ్రి చెప్పినట్టు నడుచుకో. అతని శత్రువులతోగాని, వారి మిత్రులతోగాని చేరకు. నన్ను ఎలా చూసుకున్నావో, అలాగే ఇక ముందు సుగ్రీవుణ్ణికూడా చూసుకో," అని చెప్పి ప్రాణాలు వదిలాడు. వానరు లందరూ ఒక్కసారి గొల్లున ఏడిచారు. తార తన భర్త కళేబరాన్ని కౌగలించుకుని మూర్ఛపోయింది.

తరవాత నీలుడు వాలి రొమ్మున నాటు కున్న రాము బాణాన్ని లాగేశాడు. అంగదుడు తండ్రి పాదాలకు నమస్కారం చేశాడు. సుగ్రీవుడు కళ్ళ నీరు కార్చుతూ రాముణ్ణి సమీపించి, "రామా, నీవు అన్న ప్రకారం వాలిని వధించావుగాని నాకు భోగాల మీదా, జీవితం మీదా కూడా విరక్తి కలిగింది. ఈ తారా, కిష్కింధలోని వానరులూ, అంగదుడూ ఈ దుఃఖ సముద్రంలో మునిగి ఉండగా నాకు రాజ్యమేమిటి? వాలి నన్ను పెట్టిన కష్టాలు తలుచుకున్న కోపంతో అతని చావు కోరాను. ఇప్పుడు పశ్చాత్తాపం నన్ను దహించేస్తున్నది. వాలి దొడ్డ బుద్ధిగలవాడు, నన్ను చంపటానికి ఎన్నడూ యత్నించలేదు. అతణ్ణి చంపాలన్న కోరిక మహా పాపినైన నాకే కలిగింది. నేనుకూడా వాలితోపాటు దహనమైపోతాను. వానరులు నీ కోసం సీతను అన్వేషిస్తారు," అన్నాడు.



# 19. కాబా

ప్రపంచంలోని ఇస్లాము మతస్థులందరికీ అత్యంత పవిత్రమైనది మక్కా. ఇస్లాము ప్రవక్త అయిన మహమ్మద్ ఇక్కడనే జన్మించాడు. మతాంతరులు మక్కాలోకి అడుగు పెట్టరాదు.

మక్కాలోని మసీదు యొక్క ఆవరణలో కాబా (బొమ్మలోని నల్లని కట్టడం) ఉన్నది. ఇది మహమ్మద్‌కు పూర్వం నుంచీ ఉన్నది; ముస్లిముల అతి పురాతనాలయాలలో ఒకటి. ఈ ఆలయానికి ఎటు వైపునా కిటికీలు లేవు. ఒకే ద్వారం ఉన్నది. అది నేలకు 7 అడుగుల ఎత్తున ఉన్నది. ఈ ద్వారానికి నల్లని తెర అడ్డం కట్టి ఉంటుంది. ఇది సరిగతో తయారు చేసినది. దీనిని "కిస్వా" అంటారు. ప్రతి ఏడూ ఈ కిస్వాను మార్చుతూంటారు. ఏటా ఈజిప్టు నుంచి వచ్చే యాత్రికుల ద్వారా అక్కడి ప్రభుత్వం కాబా నిమిత్తమై సరి కొత్త కిస్వా పంపుతూంటుంది.

కాబా కట్టడములోని కోణాలలో ఒక దానిలో "నల్లరాయి" భక్తులు ముద్దుపెట్టుకోవటానికి వీలయిన ఎత్తున అమర్చి ఉన్నది. మక్కాలో దీనిని మించిన పవిత్రవస్తువు లేదు. ఈ నల్లరాయిని గేబ్రియల్ అనే దేవదూత అబ్రహంకు ఇచ్చాడట.






1. జి. బి. రాజా, బెల్లంపల్లి

తమ పత్రికలో హేమాహేమి లనబడే రచయితల రచనలు ఆపి ఈనాటి చిన్న రచయితలకు ఎందుకు ప్రోత్సాహమివ్వరు?

నిజమైన "చందమామ" పాఠకులెవరూ రచయితల పేర్లు చూసి ఆనందించరు. మా రచయితలలో కీర్తి కోసం రాసేవారూ, హేమాహేమీలూ ఎవరూ లేరు. మీ సలహా ప్రకారం "చిన్న రచయితలను" ప్రోత్సహించటమే పనిగా పెట్టుకుంటే మాకు పాఠకులే ఉండరు.

2. ఎస్. మధుసూదన్‌రావు, మద్రాసు

అన్నయ్యా, మీరు రామాయణములోని అరణ్యకాండలో కాకాసురుని కథ ఎందుకు ప్రచురించలేదు?

ఆ కథ అరణ్యకాండలో రాదు, సుందరకాండలో వస్తుంది.

3. సి. సీతాలక్ష్మి, కరీంనగర్

"చందమామ"లో సూచనల కోసం ఒక పేజీ కేటాయించిన మంచిది కదా!

సూచనలు చేయగోరేవారు "పాఠకుల లేఖలు" శీర్షికను ఉపయోగించవచ్చు.

4. ఆర్. జయరాజు, బెంగళూరు

తెలుగు "చందమామ"లోని పద్యావళిని (గేయ కథను) కన్నడంలోకి అనువదిస్తున్న వారి పేరు అడ్రెసు ఏమి?

ఎం. రంగరావు, "చందమామ".

5. శ్రీరామ వెంకటసుబ్బారావు, రాజమండ్రి

అన్నయ్యా, మీరు "రాకాసిలోయ", "గంధర్వ చక్రవర్తి కూతురు" మంచి రసవఠ్తములో కథ ఆపి వేస్తున్నారు. దీనికి కారణమేమిటి?

పాఠకులు కథను మరింత బాగా జ్ఞాపకం పెట్టుకునేటందుకు అలా చేస్తున్నాం.

6. విశ్వశ్రీ, అనకాపల్లి

ఆకాశంలో నక్షత్రాలు కొన్ని యెక్కువ కాంతితోనూ మరికొన్ని తక్కువ కాంతితోనూ ప్రకాశిస్తాయేమండీ? అన్నీ నక్షత్రాలే కదా వాటికీ భేదం ఎలా ఏర్పడింది?

అన్ని నక్షత్రాలూ ఒకటి కాదు. మనుషుల్లోలాగే వాటిలో వయోభేదం ఉన్నది. కొన్ని ముసలివి, కొన్ని పడుచువి. కొన్ని వృద్ధిలో ఉన్నవి, మరికొన్ని క్షీణ దశలో ఉన్నవి. ఇది ఇలా ఉంచి, మనకు కనిపించే నక్షత్రాలన్నీ ఒకే దూరంలో లేవు. సూర్యుడు కూడా నక్షత్రమే అయినా మిగిలిన నక్షత్రాల కన్న చాలా కాంతివంతంగా కనిపిస్తుంది. సూర్యుడి కన్న అనేక లక్షల రెట్లు కాంతి గల నక్షత్రాలు ఎంతో దూరాన ఉండటంచేత తక్కువ కాంతితో కనిపిస్తాయి.

7. లంకా సత్యనారాయణ, రాజమండ్రి

విజ్ఞాన వేత్తలు తాము కనుగొనిన క్రొత్త విషయములకు ముందు వారి పేరు పెట్టుకుంటారు, ఎందుకండి?

ఆ అంశం ఫలాని వారు కనిపెట్టారని తరతరాల వారికి తెలియుగలందులకు.

8. వెల్లంకి అన్నపూర్ణ, తాడేపల్లిగూడెం

నేడు నేను జులై నెలలో ప్రకటించబడు ఫొటో వ్యాఖ్యల పోటీకి ఇరువది వ్యాఖ్యలు పంపిస్తున్నాను. మూడు కార్డులు పట్టాయి. ఇన్‌లాండ్ ఉత్తరం మీద అయితే యింకా చాలా పంపవచ్చు కదా! పోస్టలు వాళ్ళు చదవరా?

సందర్భం వచ్చింది గనక ఒక రహస్యం చెబుతాను. ఫొటో వ్యాఖ్యల పోటీకి డజన్ల కొద్దీ వ్యాఖ్యలు పంపిన వారెవరూ ఇంతవరకు బహుమతి పొందలేదు. హెచ్చు మంది ఒకె వ్యాఖ్యతోనే బహుమతి పొందారు. ఒకరిద్దరు కాబోలు రెండు మూడు వ్యాఖ్యలతో బహుమతి పొందటం జరిగింది. ఏ ఫొటోలకైనా మంచి వ్యాఖ్యలు 20 ఒకే మనిషికి స్ఫురిస్తాయంటే నమ్మశక్యం కాదు. పోస్టలు వాళ్ళకు చందమామ ఫొటో వ్యాఖ్యలు చదివే అవకాశం ఎక్కడ ఉంటుంది?

9. ఎస్. రామకృష్ణ, చీపురుపల్లి

అన్నయ్యా, సుగ్రీవుడు వానరుడు కదా ఏప్రిల్ నెల సంచికలో మానవ రూపమున ఎందుకు ప్రచురించారు?

బొమ్మలే తప్ప అక్షరాలు చదివే అలవాటులేదా, తమ్ముడూ? సుగ్రీవుడు మానవ రూపంలో రాముడి వద్దకు వచ్చినట్టు కథలో ఉన్నదే!

Photo by Anant Desai



బహుమతి
పొందిన వ్యాఖ్య

నిండు పున్నమి

పంపినవారు:
డి. వి. ఆర్. రత్నం

# మీకు తెలుసా?

- ★ శనిగ్రహం చుట్టూ మూడు వలయాలున్న సంగతి మనకు తెలిసినదే. అదే విధంగా భూమి చుట్టూ ఒక పలకలాటి వలయం ఉన్నది. అందులో హైడ్రోజెన్ అణువు లున్నాయి. ఈ వలయం భూమికి 10,000 కిలోమీటర్ల దూరంలో ఉన్నది. చంద్రుడి పైన మనుషులుంటే వారు ప్రత్యేక సాధనాల సహాయంతో ఈ వలయాన్ని పూర్తిగా చూడగలుగుతారు.
- ★ అంతరిక్షం నుంచి చూస్తే భూమిపై అనేక రంగులు కనిపిస్తాయి. ఆఫ్రికా ఖండం చాలావరకు పసుపుపచ్చగానూ, దక్షిణ అమెరికా ఆకుపచ్చ రంగుగానూ కనిపిస్తాయి. సముద్రాలలో కూడా తేడా ఉన్నది. పెసిఫిక్ కన్న అట్లాంటిక్ సముద్రం ముదురు రంగుగా కనిపిస్తుంది.
- ★ ఇంద్రియజ్ఞానా లన్నిటిలోకీ చురుకైనది స్పర్శ. స్పర్శేంద్రియాల అనుభూతి మెదడును చేరటానికి 0.09 సెకండు మాత్రమే పడుతుంది. ధ్వనులు 0.12 సెకండులోనూ, దృశ్యాలు 0.15 సెకండు కాలంలోనూ మెదడుకు అందుతాయి.
- ★ మనిషి ఒకే కాలమందు 5 మొదలు 7 భిన్న వస్తువులను మాత్రమే చూడగలడు.
- ★ మనిషి చేతికి సులువుగా సాధ్యమయేవి సెకండుకు 5 కదలికలు మాత్రమే.
- ★ సెకండుకు 2,000 కంపనాలకు పైబడిన ధ్వనులను మనిషి చెవి వినలేదు. ఇలాటి శ్రవణాతీత ధ్వనులను కుక్కలు మొదలైనవి వినగలవు. ఈ ధ్వనులు సయితం మనుషులకు వినిపించటానికి పరికరాలు కనిపెట్టారు. వీటి సహాయంతో 2,00,000 కంపనాలు గల ధ్వనులు కూడా స్పష్టంగా వినిపిస్తాయట. ఈ పరికరాల సహాయంతో క్లిష్టమైన చెవిరోగాలను కనిపెట్టుతున్నారు.
- ★ "గాస్క్రొమాటోగ్రాఫ్" అన్న పేరు చాలామంది విని ఉండరు. ఇటీవలనే కనిపెట్ట బడిన ఈ యంత్రం వాసనలను "రికార్డు" చేస్తుంది! ఉల్లగడ్డలూ, పాలూ మొదలైన ఏ వస్తువుయొక్క వాసననైనా ఇది రికార్డు చేస్తుంది. ఇలా చేయటంవల్ల ఉపయోగం ఏమిటంటే ఏ వస్తువులో ఏయే రసాయన ద్రవ్యాలున్నదీ వెంటనే తెలిసిపోతుంది.
- ★ భూమియొక్క పై పొరా, దానితో చేరి ఉన్న జలరాశీ ఏర్పడి 400 లేక 450 కోట్ల సంవత్సరాలై ఉంటుందని శాస్త్రజ్ఞుల అంచనా.
- ★ సోవియెట్ రష్యాలో బంగారం హెచ్చుగా దొరికే ప్రాంతం ఉరాల్ పర్వతాలు. ఇక్కడ ఇటీవల 36 కిలోగ్రాముల 22 గ్రాములు బరువు గల బంగారు రాయి దొరికింది. ఈ ప్రాంతంలోనే 1842 లో ఇంతకన్న కూడా కొంచెం హెచ్చు బరువు— 36 కిలోగ్రాముల 40 గ్రాములు —గల బంగారు రాయి దొరికింది.

## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫొటోల వ్యాఖ్యలు 1963 ఆగష్టు నెల సంచికలో ప్రకటింపబడును.





★ పై ఫొటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ జూన్ నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:–చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు–26.

### జూన్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : నెలపొడుపు

రెండవ ఫోటో : నిండు పున్నమి

పంపినవారు : డి. వి. ఆర్. రత్నం,

మచిలీపట్నం.

బహుమతి మొత్తం రు. 10/– ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

# భారతం

ఉలూచి అన్న మాటలతో బభ్రువాహనుడికి రోషం వచ్చింది. అతను బంగారు కవచమూ, మెరిసే శిరస్త్రాణమూ ధరించి, ధనుర్బాణాలు తీసుకుని రథ మెక్కాడు. రథం నిండా ఆయుధాలున్నాయి, దాని పైన సింహధ్వజమున్నది. ఆ రథంలో అతను అర్జునుడి వద్దకు వెళ్ళి, తన మనుషులను గుర్రాన్ని పట్టమని ఆజ్ఞాపించాడు.

ఇది చూసి సంతోషించి అర్జునుడు భూమిపైన నిలబడే తన కొడుకును ఎదుర్కొన్నాడు. ఇద్దరి మధ్యా భయంకరమైన యుద్ధం సాగింది. ఇద్దరూ బాగా గాయపడ్డారు. బభ్రువాహనుడు వేసిన ఒక బాణంతో అర్జునుడు స్పృహతప్పి పడిపోయాడు. చాలా దెబ్బలు తిని ఉన్న బభ్రువాహనుడు తండ్రినిచూసి తానుకూడా స్పృహతప్పి పడిపోయాడు.

బభ్రువాహనుడి తల్లి చిత్రాంగద యుద్ధం జరిగే చోటికి వచ్చి స్పృహలేక పడి ఉన్న భర్తనూ, కొడుకునూ చూసి వణికిపోతూ, ఏడవ నారంభించింది. ఆమె ఉలూచిని చూసి, "ఇదేమిటి అక్కా ? తండ్రిని కొడుకు చేత చంపించి, ఏమీ పట్టనట్టున్నావేమిటి ? నా కొడుకు పోతే మానె, అర్జునుడినయినా బతికించు. లేకపోతే ఆత్మహత్య చేసుకుంటాను," అన్నది.

కొంతసేపటికి బభ్రువాహనుడికి స్పృహ వచ్చింది. అతను తల్లిని చూశాడు. ఆమె తన భర్త కోసం ఏడుస్తూ ఉండటం చూశాడు. ఎంతో నొచ్చుకుని, గుర్రం వెంట వచ్చిన బ్రాహ్మణులను తండ్రిని చంపిన వాడికి ప్రాయశ్చిత్తం ఏమిటని అడిగాడు.

పశ్చాత్తాపంతో అలమటించే బభ్రువాహనుణ్ణి సమీపించి ఉలూచి, "నాయనా, నీ తండ్రి గురించి భయపడకు. నీ పరాక్రమం చూసి నీ తండ్రి సంతోషించాలని మీకు కయ్యం పెట్టాను. ఇదుగో సంజీవన మణి. దీనిని మీ తండ్రి రొమ్ముపై ఉంచు, ఆయన బతుకుతాడు," అన్నది. ఆమె చెప్పినట్టే, మణి రొమ్మున పెట్టగానే అర్జునుడు నిద్ర మేలుకున్నట్టుగా లేచి కూచున్నాడు.

అతను తనకు మొక్కిన బభ్రువాహనుణ్ణి కౌగలించుకుని, ఉలూచినీ చిత్రాంగదనూ చూసి, "ఇక్కడికి వీళ్లలా వచ్చారు ?" అని అడిగాడు. ఉలూచి అతనితో తానెందుకు వచ్చినదీ, ఏమి జరిగినదీ చెప్పింది. భీష్ముణ్ణి చంపిన పాపం తనను బాధించకుండా ఉలూచి ఈ పని చేసిందని విని సంతోషించి అర్జునుడు బభ్రువాహనుణ్ణి అశ్వమేధయాగానికి ఆహ్వానించి, తిరిగి యాగాశ్వం వెంట బయలుదేరాడు.

యాగాశ్వం సముద్రతీరం దాకా వెళ్ళి హస్తినాపురి దారి పట్టి మగధ, చేది, కాశి, కోసల మొదలైన దేశాల మీదుగా దక్షిణదేశం సంచరించి, గాంధారానికి వెళ్ళి తరవాత హస్తినాపురం చేరుకున్నది. ఈ యాత్రలో అర్జునుడు చాలా మందిని ఓడించాడు. వారిలో చెప్పుకోదగినవారు మగధరాజు మేఘసంధి, నిషాదరాజు ఏకలవ్యుడు, గాంధార రాజైన శకునికుమారుడు. అతను తనతో ఓడిన వారందరినీ అశ్వమేధ యాగానికి ఆహ్వానించాడు.

Printed by B. NAGI REDDI at the B. N. K. Press Private Ltd., and Published by B. VENUGOPAL REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor : 'CHAKRAPANI'

# తుషార్‌తో వండిన పదార్థాల రుచి ఇంట్లో అందరికీ యిష్టమే




తుషార్ వనస్పతిలో వున్న ఆ ప్రత్యేకమైన రుచివల్ల అది కుటుంబాని కంతకూ యిష్టమైన పదార్థమైంది. తుషార్‌తో చేసిన వంటకాలు ఎక్కువ రుచిగా వుండుటమేగాక పుష్టికరంకూడా. ఎందుకంటే తుషార్‌లో ఎ,డి, విటమినులు వున్నాయి. రుచికరమైన భోజనంకోసం తుషార్‌ను వాడండి!

**తుషార్** వనస్పతిలో ఎ, డి విటమినులు కలవు.

తుంగభద్రా ఇండస్ట్రీస్ లిమిటెడ్, కర్నూలు

న్యూట్రిన్ కంటె దేవిక మధురమని మీరంటే మా కేలాంటి ఆక్షేపణ లేదు!

అయితే, అనేక రకాల మిఠాయిల రుచులను పోల్చుతూ, అందాల తార దేవిక అన్నారు:





"న్యూట్రిన్ మిఠాయిలు అద్వితీయమైన శ్రేష్ఠత కలవి.
న్యూట్రిన్‌తో సమానమయిన టాఫీలు, మిఠాయిలు, నాకు వేరే ఏవి అగుపడ లేదు. పండ్లు తిన్నట్టు చక్కని రుచులు. నేను కోరునది—న్యూట్రిన్.



నాణ్యత నెఱిగి....
...న్యూట్రిన్ కొనండి.



న్యూట్రిన్ కన్ఫెక్షనరీ కంపెనీ ప్రైవేట్ లిమిటెడ్
చిత్తూరు, ఆం. ప్ర.

---



# నోపిన్

కాల్ కెమికోవారి బాధా నివారిణి

కండరముల నెప్పి, సియాటికా, నండె జలుబుల నుండి సత్వర విముక్తికొరకు




# మార్గ్యూఎన్టమ్

సీమ్క్రీమ్

దురదలు, పొంటిమలు, స్ఫోటకపు మచ్చలు, కురుపులు, గాయములు, పుండ్లు, మొ. వాటికి

కాల్ కెమికోవారి వస్తువులు—"మార్గో" నమ్మకముతో తయారు చేయువారు.

CF-2-TLG-61

దక్షిణ ఇండియా ఆఫీసు: 5/149, బ్రాడ్వే, మద్రాసు-1.

# పొదుపుకోసం అమృతాంజన్ అట్టపెట్టెల్లో వస్తోంది




నేడు మన దేశపు ఆదాయము రక్షణ కొరకు అవసరము. సాధారణంగా పరిచితమైన అమృతాంజన్ డబ్బా తయారుచేయడానికి కావలసిన టిన్ రేకు నేడు జాతీయ అత్యవసరాలకు కేటాయింపబడినది. కాబట్టి దీనికి బదులు మేము క్రొత్త రకం పొదుపైన అట్టపెట్టె వాడుతున్నాము. ఇంతేగాకుండా సీసాలో నమ్మకమైన అమృతాంజన్ అందజేయడానికి మోసంచేయడానికి వీలులేకుండా 'అలు'కాప్ ('Alu'-cap) తో సీసా సీలు చేయబడింది. ■పూర్వం ఎప్పటికంటే కూడా ఇప్పుడు మీకు అమృతాంజన్ ఎక్కువ అవసరము. కండల నొప్పులు, బెణుకులు, గుండె బలుబులు, కీళ్ళ నొప్పులు, ఆరోగ్యం చెరచి నీరసపరచి అధికంగా కావలసిన ఉత్పత్తులను తగ్గించే రోగాలు నిర్మూలించడానికి సహకరిస్తుంది.

*అమోఘమైనది, మిత వ్యయంతో కూడినది, అనేక విధాల ఉపయోగపడేది.*

అమృతాంజన్ అమోఘంగా పనిచేసే నొప్పుల నివారణిని మీరు కొనవచ్చు. ఇటువంటి మందులన్నిటి కంటె దీనిలో గుణావహకమైన ఔషధాలు అధిక పరిమాణాల్లో ఉంటాయి. దీనిలో ఏకమైయున్న మందులు బాధలను నివర్తించి వెంటనే ఉపశమనం కలిగించడానికి శరీర చర్మంలో అతి శీఘ్రంగాను లోతుగాను ప్రవేశిస్తాయి. ప్రతిసారీ మీకు ఏ నాలుగు వర్లగింజల ఎత్తో అమృతాంజన్ కావలసి ఉంటుంది. ఇంట్లో ఇంటిల్లిపాదీ ఉపయోగించినా ఒక బుడ్డి నెలల తరబడి ఉపయోగానికి వస్తుంది.




## అమృతాంజనము

ఆరోగ్యం ఇస్తుంది

అమృతాంజన్ లిమిటెడ్ 14/15 లత్ చర్చి రోడ్, మద్రాసు

JWT AM/2225'B

STUDIO Roopkala

అనురూపావారి

# అనురాగం

దర్శకత్వం
రామినీడు

తప్పక చూడండి



నిర్మాతలు
టి. హనుమంతరావు
డి. సూర్యనారాయణ



VANAJA

డిస్ట్రిబ్యూటర్సు
ఆంధ్ర, సీడెడ్ : విజయ
నైజాం :

87

